# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.

సాలుచందా 1-8-0.

సంపాదకుడు :

అంద్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట : ౫. ధాతు, మాఘము : ఫిబ్రవరి, 1937. సంచిక : ౭.


## సంపాదకీయ సమాలోచన

### ౧. కాంగ్రెస్‌కు ఓటు చేయుడు :—

ఈ నెల 18-వ తేదీని మనరాజధానియందు ఎన్నికలు జరుగనున్నవి. ఈసారి ఎన్నికలయందు కాంగ్రెసుకూడ పాల్గొనుచున్నది. ఏబది సంవత్సరములుగ ప్రజాహితముకొఱకు అనేకరీతుల ప్రభుత్వమును ప్రతిఘటించుచు విశాలవిశ్వముయొక్క అద్భుతదృష్టిని ఆకర్షించిన కాంగ్రెస్‌యొక్క ఆదేశమును శిరసావహించి ఓటరులందరును కాంగ్రెసు నిలిపిన అభ్యర్థులకు తమసమ్మతులనిచ్చి కాంగ్రెసు పలుకుబడిన్ని లోకమునకు వెల్లడింతురుగాకయని కోరెదము. ఓటరులు తాము ఓటుచేయునపుడు తమదృష్టిని వ్యక్తులపై గాక కాంగ్రెస్ మహాసంస్థపై నిలిపియుంచెదరుగాక !

### ౧. పసుపురంగు శుభంకరమైనది :—

అనంతకాలమునుంచి పసుపురంగు భారతదేశమున శుభంకరమైనదిగా పరిగణింపబడుచున్నది. కళ్యాణకరమైన ఆరంగును కాంగ్రెస్‌వారు చేకొని తమ ఎన్నికలపెట్టెలకు హత్తించినారు. కాంగ్రెస్‌వారికి జయముకలిగి తీరుననుటకు ఇది యొక మంచిసూచన. భావిఫలములు ఇట్లు ఏదియో యొకరూపమున భగవంతుడు మనకు చూపుచునేయుండును. ఎట్లును కాంగ్రెసుకు జయముతప్పదు కావున సంశయగ్రస్తులెల్లరును నిశ్చలమనస్కులై కాంగ్రెస్‌వారి పసుపుపచ్చని పెట్టెలలో తమ ఓట్లనువైచి దేశమునకు శుభమును కూర్తురుగాక !

### ౧. నవ్యసాహిత్యపరిషత్తు ఐదవవార్షికోత్సవము :—

గతమాసము 23, 24 తేదీలలో గుంటూరు పురమందిరములో నవ్యసాహిత్య పరిషత్తువారి పంచమవార్షికోత్సవము జయప్రదముగ సాగినందులకు మిక్కిలి ఆనందితుల మగుచున్నాము. ఈసమావేశమునకు శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు అధ్యక్షత వహించుటచే అనంతగౌరవము కలిగినది. కాని సమావేశసమయము కనిపించిన ఉత్సా

హము తరువాతి కార్యాచరణమున కనిపించుటలేదు. నవ్యసాహిత్యపరిషత్తు ప్రబలముగా యువకులది. యువకుల కుండదగిన కార్యశౌర్యము మాత్రము అందు మృగ్యముగా నున్నది. నవ్యసాహిత్యపరిషత్తువారు దీనిని గమనింతురుగాక !

౯. యం. యస్. యమ్. రైల్వే కంపెనీ కంట్రాక్టు గడువు :—

యం. యస్. యమ్. రైల్వేకంపెనీవారి కంట్రాక్టుగడువు ఈయేటితో తీరనున్నది. మరికొన్ని రైల్వేకంపెనీలవలెనే ఈకంపెనీని కూడ ఇకమీదట భారతప్రభుత్వమువారు స్వాధీనముచేసికొందురని ప్రజలు నమ్మియుండిరి. ఈనమ్మకమునకు వ్యతిరేకముగా ఇప్పుడీ కంపెనీవారి కంట్రాక్టుగడువు 1945 వరకును పొడిగించిరని తెలియుచున్నది. ఇట్టి విషయములందైనను ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయమును గుర్తింపకుండుట శోచనీయము.

౯. గోదావరి మండలమున తాటిచెట్ల కల్లుగీత :—

గోదావరి మండలమున శెట్టిబలిజకులస్థులకు తాటిచెట్ల కల్లుగీత సంక్రాంతిమొదలు నాలుగు మాసములవఱకు తప్పక ఉండెడుపని. ఈ నాలుగు మాసములును వారి కదియే ప్రధానవృత్తియని చెప్పవచ్చు. తాటికల్లునుంచి వారు బెల్లమువండి ప్యారీకంపెనీవారికి అమ్ముదురు. కంపెనీవారీ బెల్లమునుకొని సామర్లకోటలోని తమ పంచదార ఫ్యాక్టరీయందు పంచదార, సారాయి, పిప్పరమెంట్లు మున్నగునవి తయారుచేయుదురు. ఇందువలన వారు విశేష లాభమును తీయుచునే యున్నారు. తమ కిట్టి విశేషలాభము కలుగుటకు కారణభూతులగుచున్న సెట్టిబలిజలపై మాత్రము కంపెనీవారికి ప్రత్యేకాభిమానము లేకున్నది. తాటిబెల్లము కొనుగోలు విషయమున ప్యారీకంపెనీవారికి పోటీదారు లెవ్వరును లేరు. అగుట వారు చెప్పినధరకే సెట్టిబలిజలు తమ కష్టార్జితమగు తాటిబెల్లమును విక్రయింపవలసినవారగుచున్నారు— దీనికితోడు ఈయేడు ఎక్సయిజు అధికారులుకూడ సెట్టిబలిజలపై క్రొత్త నిర్బంధములను తెచ్చిపెట్టిరి. ఈకారణములన్నిటిచేతను వేసరి సెట్టిబలిజలు ఈయేడు కల్లుగీయుటకు నిరాకరించి సమ్మెకట్టిరి. గోదావరి మండలమున విస్తరించియున్న ఈ జాతివారిట్లు ఇపుడు తాత్కాలికపు నిరుద్యోగమునబడి క్రుంగుచున్నారు. ఈ కులమువారు బర్మాకు వలసవెళ్ళి వచ్చుటకు అలవడియున్నారు. కాని రాజకీయకారణములవలన వీరికిపుడు బర్మావైపుకూడ మోజుపోవుటలేదు. ఎటులైనను ఈ కులమువారికివి కష్టదినములు. నాయకులు తగు ప్రయత్నములుగావించి మోక్షోపాయ మాలోచించి కులసముద్ధరణమునకు గడంగవలసి యున్నది.

౯. హిందూదేశమున చలిజ్వరబాధ :—

హిందూదేశమున చలిజ్వరబాధ క్రమముగ అతిశయించుచున్నది. 1934–వ సంవత్సరమున 13 లక్షలమంది జనులు ఒక్క చలిజ్వరము కారణముగ మరణించిరని తెలియుచున్నది. ఇట్లు చనిపోయినవారిలో పలువురకు ఆసుపత్రులయొక్క కాని ప్రయివేటు డాక్టర్లయొక్క కాని సాయము లభించలేదనియే చెప్పవలసియున్నది. ఏడాదికి పదమూడులక్షల

ప్రాణుల మరణమునకు కారణమగుచున్న చలిజ్వర దేవతను దేశమునుండి సత్వరముగ పార ద్రోలుటకు అధికారులును, ప్రజానాయకులును తీవ్రముగ కృషిసల్పవలసియున్నది.

౯. స్కూలు ఫైనలు పరీక్ష సెంటరుల తగ్గింపు :—

స్కూలుఫైనలువరకు తరగతులున్న ప్రతి పాఠశాలయందును ఇంతవరకు స్కూలు ఫైనలు పరీక్షకు సెంటరు ఉండినది. ఇకమీదట ఈసెంటరులు చాలభాగము తగ్గింపబడు ననియు, ఒక్కొక్క జిల్లాకు ఏవో కొన్ని నిర్దిష్టస్థలములందు మాత్రమే సెంటరులు ఏర్పాటు చేయుదురనియు తెలియవచ్చుచున్నది. ఈవార్త నిజమైనదేయగుచో విద్యార్థులకు పరీక్షల ముందు స్థానభ్రష్టత, క్రొత్తతావులందు భోజనము, అదనపు ప్రయాణపు ఖర్చులు తగులును. ఈతగులుబాటు కోరదగినదికాదు. విద్యార్థుల తలిదండ్రులును, పాఠశాలాధికారులును ఈ విషయమై తగు ఆందోళన తరుణమున కావింపవలసియున్నది.

౯. తురుష్కస్థానమున స్త్రీలకు సైనికశిక్షణము :—

ఘోషాదురాచారమునకు ఆదిపీఠమైయుండిన తురుష్కస్థానమున పదిపండ్రెండు వత్సరములుగ స్త్రీలు పొందుచున్న అభివృద్ధి అద్భుతావహముగ నున్నది. ఘోషా ఆచార మిప్పు డచ్చట దొరకనివస్తువైనది. ఇటీవల అచటి విద్యాశాఖమంత్రి ప్రతిబాలికయు పాఠశాలలో అభ్యసించు ఇతర విషయములతోబాటు గుర్రపుస్వారి, కత్తిసాము, మోటారు నడుపుట, తుపాకిపేల్చుట మున్నగు సైనికశిక్షలనుకూడ విధిగా నేర్వవలయునని ఆర్డరు జారీచేసినాడు. ఈసైనికశిక్షలయందు పరిచయ మేర్పడినగాని విద్యార్థినులకు సర్టిఫికెట్టుల నీయరాదని అతనిఆజ్ఞ. అచటిస్త్రీలు మొన్నటివరకు భారతస్త్రీల కెంతయో వెనుకబడి యున్నారు. మరినాలుగు సంవత్సరములకు భారతస్త్రీలు అచటిస్త్రీలకు ఎంతయో వెనుక బడుదురు. వెనకబడక యేమిచేతురు ? మనస్త్రీలు మామూలుగ కూర్చునియున్నారు. అచటివారు అభివృద్ధిమార్గములనుబట్టి పోవుచున్నారు.

౯. భారతదేశ నౌకావ్యాపారము :—

ప్రపంచమునందలి వివిధదేశముల ప్రభుత్వములు ఆయాదేశముల నౌకావ్యాపారాభివృద్ధికి అనంతముగ సాయపడుచుండ భారతప్రభుత్వముమాత్రము భారత నౌకావ్యాపారాభివృద్ధికి ఎట్టిసాయమును చేయకపోవుటయ్యేగాక ప్రత్యక్షముగ ఆంగ్ల నౌకావ్యాపారాభివృద్ధికి తోడుపడుచున్నది. స్వరాజ్యమువచ్చినగాని హిందూదేశమున ఇట్టి తనకుమా ములు కట్టువడిపోవు.

౯. ఆఫ్రికాఖండమున భారతీయులు :—

దక్షిణాఫ్రికాలో ఇండియాతరపున ఏజంటు జనరల్‌గానున్న స గారు ఇటీవల లండనులో ఉపన్యసించుచు దక్షిణాఫ్రికాలో భారతీయ విద్యావిషయములందు మంచి అభివృద్ధిలోనున్నారని చెప్పినారు.

ముగించుకొనివచ్చిన మనోహరదాస్ ఖిల్నానీగారు ఆఫ్రికాఖండమున భారతీయులకు ఎట్టి గౌరవములేదని, వారి ఆస్తులకు తగిన భద్రతలేదని చెప్పుచున్నారు. ఆయుద్యోగి చెప్పినది సత్యమా ? ఈయాత్రికుడు చెప్పినది సత్యమా ? మనము ఇందేది నమ్మవలయును?

౯. మాలవ్యాపండితుని మహావాక్యములు :—

'భారతదేశమున ప్రజలు సుఖపడుటకు వస్తుసామగ్రికి కొదువలేదు. కాని మనలో ఐకమత్యములేదు. దుర్భరమగు విదేశపరిపాలనమున క్రుగ్గుచున్నాము. మీరు భీరుత్వమును వీడి ధైర్యమవలంబింపుడు. స్వాతంత్ర్యము గడించెదమని శపథముచేయుడు. ఏబదిఏండ్లుగ ఈదేశమును సేవించుచున్నాను. ఇక ఈ దేశమును, ఈ ప్రపంచమును నేను వదలి వెళ్ళి పోవలసినరోజులు వచ్చుచున్నవి. దేశము దాస్యశృంఖలములనుండి విడుదలగాంచకుండగనే నే నీదేశమును వీడవలసివచ్చుచున్నందులకు నాకు చాల విచారమగుచున్నది. ఈదేశమునందు త్వరలో స్వాతంత్ర్యభాను డుదయించునట్లుచేసి నావంటి వృద్ధులకు అవసానకాలములో అవమానము, ఆవేదన లేకుండ మీరు చేయవలెనని ప్రార్థించుచున్నాను.' మాలవ్యాపండితుని ఈమహావాక్యములు మందప్రజ్ఞులను సయితము కార్యశౌర్యమునకు పురిగొల్పజాలి యున్నవి.

౯. బెజవాడలో కళాశాల స్థాపనము :—

'ఉదారస్వభావులగు ఉయ్యూరు రాజావారు బెజవాడలో కాలేజీస్థాపించి విద్యార్థులకు విద్యాధర్మము చేయనున్నారు. ప్రస్తుతము మనరాష్ట్రమున ఆర్థికక్లిష్ట పరిస్థితులు వేనకువేలు విద్యావంతుల కెంతయు బాధాకరముగ నున్నవి. ఇప్పటికే ఇట్టి నిరుద్యోగసమస్య ఇట్లుండ కాగల విద్యార్థుల పరిస్థితులెట్లు పరిణమించునో చెప్పజాలము. అట్టి నిరుద్యోగ విద్యార్థులకుగూడ నొక తెరవు గనుపరుపవలసియున్నది. కనుక రాజావారు స్థాపించు కాలేజీ ఇండస్ట్రియల్ కాలేజిగ మార్చి విద్యావంతుల నిరుద్యోగసమస్య నిర్మూలనము చేయుటకు కొంతవరకు సాయపడుదురుగాక యని కోరుచున్నాను' అని జె. వి. నాయుడుగారు 'భారతీయవైశ్య' పత్రికలో వ్రాసిన వాక్యములు ఆలోచింపదగినవై యున్నవి. బెజవాడ ఇండస్ట్రియల్ కళాశాలస్థాపించుట కెంతయు అనుకూలప్రదేశము. అచట ఇండస్ట్రియల్ కాలేజీని స్థాపించుట ఆంధ్రులకు మహోపకారమును చేయుటయేయగును.

౯. ఆంధ్రులకిదియొక సంతోషవార్త :—

విద్యాలయమునందు గణితశాఖాధికారిగ పనిచేయుచున్న శ్రీయుత
రికి ప్రపంచమునందలి ప్రాచీనవిశ్వవిద్యాలయములలో నొకటియైన
యమువారు పి. హెచ్.డి బిరుదము నొసంగిరి. ఆంధ్రులలో నిట్టి గౌర
మస్వామిగారే ప్రథములు. ఆంధ్రకీర్తికి ఖండాంతరవ్యాప్తి దెచ్చిన
మున చేరినవారగుచున్న రామస్వామిగారికి మాయభివాదములను

౯. తీర్మానించిన మాత్రమున ఏమిలాభము ?:—

పాట్నా యూనివర్సిటీవారు విద్యార్థులు విధిగ పఠింపవలసిన ఇంగ్లీషుభాషను తప్ప మిగిలిన పాఠములనన్నిటిని మాతృభాషద్వారానే నేర్పవలయునని తీరుమానమును గావించిరి. ఇటీవల ఇట్టి తీరుమానములు మరికొన్ని విశ్వవిద్యాలయములుకూడ చేసియున్నవి. అయినను ఈ తీరుమానములు ఆచరణదశకు మాత్రము వచ్చుటలేదు. ఆచరణదశకురాని ఇట్టి వట్టి తీరుమానములఆర్భాటము నిష్ప్రయోజనమైనది.

౯. 'గృహం అనే స్వర్గశయ్యకు పిల్లలు నల్లులు' :—

'తల్లినగుట నాకు ఇష్టంలేదు' అను శీర్షికతో ఆంధ్రభూమి దీపావళిసంచికలో శ్రీమతి వేదుల విశాలాక్షిగారు వ్రాసిన వ్యాసమునకు జబాబుగా శ్రీమతి బులుసు ప్రకాశమ్మగారు 'స్త్రీకి తల్లిఅవడంకంటె మించిన మహాభాగ్యంలేదు' అను శీర్షికతో నొక వ్యాసమును జనవరిసంచికలో వ్రాసియున్నారు. రెండువ్యాసములను చదివి శ్రీయుత ప్రయాగ కోదండరామశాస్త్రిగారు తమ యభిప్రాయము నిట్లు తెలుపుచున్నారు : "శ్రీమతి వేదుల విశాలాక్షిగారి 'తల్లినగుట నాకు యిష్టంలేదు' అనే వ్యాసాన్ని చూచినప్పుడే, కొన్ని అభిప్రాయాలుచేర్చి, అభినందిద్దామనుకొన్నాను. కాని కాలంగడచిపోయింది. ప్రకృతం శ్రీమతి బులుసు ప్రకాశమ్మగారి 'స్త్రీకి తల్లిఅవడంకంటె మించిన మహాభాగ్యం లేదు' అనే మూరెడుపొడుగు తలకట్టుతో 'ఆంధ్రభూమి' జనవరి సంచికలో వెలువడ్డ వ్యాసాన్ని చూచేప్పటికి పైజెప్పబడిన అభినందనావసరం కనిపించింది. విశాలాక్షిగారి వ్యాసం కేవలం స్వేచ్ఛను, స్వతంత్రజీవనాన్ని, నిసర్గస్వర్గమైన జాత్యధర్మాన్ని విస్పష్టంగా ప్రకటిస్తున్నది. ఆమెరచనలో ప్రతికారణమూవుంది. ప్రకాశమ్మగారి వ్యాసం కేవలం పారతంత్ర్యాన్ని, పరాధీనజీవనాన్ని, స్వార్థాన్ని ప్రకటిస్తున్నది. కారణంలేదు. ప్రస్తుతానికి ప్రకాశమ్మగారి వ్యాసాన్ని సమీక్షిద్దాం– భావిసంతానంవిషయంలో అనేకులు అనేకాభిప్రాయాలతోవున్న సంగతి విశదమే? నలుగుర్నికంటే చాలనీ, ఇద్దర్నే అయితే బాగుంటుందనీ, ఏదో - ఏదో అనీ, ఒకరుకనే సంఖ్య మరొకరి అభిప్రాయంమీద ఆధారపడే కన్న, కడుపుతోవుంటే అధికారంచలాయించే వాళ్ళందరిచేత పనులుచేయించుకోవచ్చు అనుకొనేకన్న, శవ్మగా మెక్క పెడతారు అని ఆశపడేకన్న, ఆపరాధీనతకన్న– తనవ్యక్తిత్వానికీ, స్వతంత్రతకూ, తన పరిశ్రమకూ, సంపాదనకూ ఒక పెద్ద అడ్డంకుగావున్న యీగర్భధారణ వ్యాపారంనుంచి స్త్రీ ఎందుకు విరమించుకోగూడదు ? ఉన్నన్నాళ్లూ అమృతమైన యౌవనంతో, సహజమైన సౌందర్యంతో, అనుభవ్యమైన ఆనందంతో– హాయిగా, సుఖస్వప్నంగా– గడపుకొనక, సుతుల సంభాషణములు చెవులకు భూషణములని మహాభక్తుడన్నాడనీ, అందువల్ల గర్భిణీ వ్యాపారం గృహిణీధర్మం అనీ నమ్మగలిగితే, మరొక మహాభక్తశిఖామణి! 'గృహిణులంతా గృహస్థధర్మాలను విసర్జించి, ఆ - శ్రీకృష్ణుని ప్రేమించి అతనినే కోరవలె' నన్నాడంటే నమ్మకపోవడానికి కారణంగానీ, అవసరంగానీ వుంటుందా ? పిల్లలు గృహానికి అలంకారం అంటారుమీరు, గృహం అనే స్వర్గశయ్యకు పిల్లలు నల్లులంటాము మేము ! దీనికేమన్నా సమాధానం వున్నదా– నేటిస్త్రీలు యీగర్భధారణవ్యాపారాన్నించి విరమిం

చడం ఉభయజాత్యాలకూ (స్త్రీ పురుషులకు) శ్రేయస్కారణమే అవుతుందని నా అభిమతం. బరువులేని, శ్రీమతి ప్రకాశమ్మగారి వ్యాసాన్ని యింతకన్న ఎక్కువగా, సమాధానపరచవలసిన అవసరంలేదు. శ్రీమతి విశాలాక్షిగారి వ్యాసంలోని సత్యాన్నీ, సారాన్నీ లోకం గ్రహిస్తుందిగాక ?"

**౯. బర్మాలో ఆంధ్రకార్మికులు :—**

బర్మాలోని ఆంధ్రకార్మికులనుగూర్చి 'ఆంధ్రజ్యోతి' వ్రాసిన క్రింది వాక్యములు ఆంధ్రులందఱును గమనింపదగినవి. "ప్రస్తుతము బర్మాలో ఆంధ్రకార్మికులు కిరసనాయిలు యంత్రాలలోను, బియ్యపుమరలలోను, కఱ్ఱమరలలోను, ఓడల రేవులయందలి ఎగుమతి దిగుమతి పనులయందును, రైల్వేవర్కుషాపులయందును, పి.డబ్ల్యు.డి మున్సిపాలిటీ పనులయందును, ఆతర్వాతను రబ్బరుతోటలు, తగరము, వెండి, సీసము మున్నగు వానియందును పనిపాటులను చేస్తూవున్నారు. వీరు హస్తలాఘవంగల పనులనుగాక, కేవలం మోటుపనులను చేస్తూవుండడంచేత, ఈపనులు చేసేవారికి ఏవిధమైన శిక్షణయున్ను అవసరంలేకపోవడంచేత యెవరుపడితే వారు చేసేదానికి వీలుగావుంటున్నది. ఇందువలన, ఈలాంటి పనులు చేసేవారిలో పోటీ నానాటికి అధికమై కూలిపెరిగేదానికి అడ్డంకులు ఏర్పడుతూ వున్నవి. ఎవరైనా ఒకరుగనుక, పనిమానుకుంటే వారం వారం గుంపులు గుంపులుగా స్వదేశమునుండి వచ్చే ప్రజలలో ఒక్కనిచోటికి పదిమందికాదు, వందమంది సిద్ధమవుతున్నారు. ఈలాంటి వాతావరణములో కార్మికుల స్థితిగతులు అనుకూలముగా మార్చాలంటే తేలికయైన పనికాదు."



దొమ్మేటి : కన్నాంబ

బెజవాడ సరస్వతిటాకీస్ వారి 'కనకతారలో' నొకదృశ్యము.

# భారతనిరుద్యోగసమస్య

రచయిత:
అద్దేపల్లి నాగగోపలరావు

## కారణములు (Causes)

హిందూదేశమునందు ప్రస్తుతము తీవ్రరూపమును దాల్చిన నిరుద్యోగ సమస్య రెండుమూడు కారణములవలన సంభవించినట్లూహింపవచ్చును.

(1) 1929 సం॥ నుండి ప్రపంచము నలముకొన్న ఆర్థికదుస్థితి. బంగారునాణెముల దుర్వ్యయము. యుద్ధఋణములు తీర్చుకొనలేమి. స్వల్పోత్పత్తి. దారుణసుంకములు.

(2) యుద్ధానంతరము త్వరితముగను, విస్తారముగను పెరిగిపోయిన ప్రజాసంఖ్య.

(3) చాలకాలమునుండి అనుసరింపబడుచుండిన పరిశ్రమవిధానమునందలి లోపములు. అశక్తి.

వ్యవసాయదారులకు సంవత్సరములో నైదారు మాసములు దప్ప తక్కినకాలమంతయు విశ్రాంతిసమయమే. పొలముపనిలేని విశ్రాంతికాలమందునను, పని యొత్తిడిలేనప్పుడును, గృహపరిశ్రమలు మున్నగు నితర కార్యములందు నియోగింపబడినచో కర్షకుని ఆదాయమును, జీవనస్థితిని (Standard of living) చాల వరకు అభివృద్ధిపరుపవచ్చును.

ఇరువదియైదు సంవత్సరములకు పూర్వము, విద్యావంతుడైన ప్రతి యువకుడును, గవర్నమెంటులోగాని, ఇతరసంస్థలయందుగాని యేదోయొక యుద్యోగమును సంపాదింపగలిగియుండెను. కాని ప్రస్తుత మట్టివారిసంఖ్య అవసరమగుదానికన్న మిన్నయైనది. చాలమంది చదువుకొన్నవారును, దూరదేశములకు బోయి, ధనవ్యయముజేసి బిరుదులందినవారును గూడ నిప్పుడు నిరుద్యోగులుగావలసినస్థితి సంభవించినది.

సాధారణముగా మధ్యమ తరగతి ప్రజల (Middle Class People) లోనే చదువుకొన్నవారి సంఖ్య యెక్కువ. వీరినే నిరుద్యోగసమస్యా పిశాచము మిక్కిలిగ పీడించుచున్నది.

సంగ్రామసమయమందును, తరువాత కొంతకాలమువరకును కూలిరేట్లు హెచ్చుగానుండుటచే కార్మికులు సుఖముగనే జీవించుచువచ్చిరి. 1929 సం॥ వరకు వారట్లే జీవింపగలిగిరి.

తదనంతరము ముఖ్యమైన ఉత్పత్తులయందలి పతనముచే వారికూలిరేట్లు పడిపోయినవి. కొనుబడి తగ్గినది. ప్రజాబాహుళ్యముగల కొన్ని ప్రదేశములందు కొనుగోలు తృప్తికరముగలేదు. నానారాష్ట్రసమితిచే ప్రకటింపబడిన లెఖ్ఖల ప్రకారము పశ్చిమదేశములందు, అమెరికాలోను నిరుద్యోగులసంఖ్య 1932 సం॥ ఆరంభదశను రెండుకోట్లను మించినది. ఈపయి దేశములందు నిరుద్యోగమువలన, చాలీచాలని పనివలనను పీడింపబడిన జనసంఖ్య ఐదుకోట్లులకు తక్కువగానియట్లు ఊహింపబడెను.

భారతదేశమునందు, ఉత్పత్తి, నిరుద్యోగముల గూర్చిన లెక్కలయందు లోపము లనేకములుండుట వలన నా విషయముల యదార్థము గనుగొనుట కష్టముగనున్నది. ఇరువదిమందికి తక్కువగా పనిచేయు నే పరిశ్రమాగారమును గూర్చియు లెక్కలులేవు. వ్యవసాయము, పంటలు, ఇతర వృత్తులపయివచ్చు ఆదాయములగూర్చి గూడ అంచన తెలిసికొనుటకు వీలు గలుగకున్నది. మనదేశమునందు నిరుద్యోగ ప్రజాసంఖ్య కొంచె మెంచుమించుగా 40 మిలియను (నాలుగుకోట్లు) లుండును. కూడు గుడ్డలులేక, నివాసస్థలములు లేక బాధపడువారి సంఖ్య 100 మిలి

యను (పదికోట్లు)లకన్న తక్కువ గానియట్లు అంచనా వేయబడినది.

## అసమవృత్తిపద్ధతి.
## (Unbalanced Occupational Structure)

హిందూదేశమునందు వ్యవసాయముపైనను తదితరవృత్తులమీదను ఆధారపడియున్న జనసంఖ్య రమారమి 73 o/o ఉండును. గత ఒకటి రెండేండ్లయందలి ఇతర దేశములలోని తత్సంబంధిక ప్రమాణము లిట్లున్నవి :

| దేశము | నూటికి |
|---|---|
| యునైటెడ్ కింగ్డమ్ | 10.0 |
| యునైటెడ్ స్టేట్సు | 22.0 |
| జర్మనీ | 30.5 |
| ఫ్రాన్సు | 38.3 |
| కెనడా | 35.0 |

ఈ సంఖ్యలు ఇతరదేశములందుకన్న భారతదేశమునందు భూమిపై నెక్కువమంది యాధారపడియున్నట్లు తెలియజేయును. వ్యవసాయమును, పరిశ్రమలుగూడ సమస్థితిలోనున్న ఇతరదేశములందుకన్న, భూమి ఆదాయముపై నాధారపడు జనసంఖ్య రెండురెట్లధికముగ నున్నది.

భారతదేశములో పరిశ్రమలపై నాధారపడియుండు జనసంఖ్య 11.2 o/o ఉండును. ఇతరదేశములందు:—

| దేశము | నూటికి |
|---|---|
| యునైటెడ్ కింగ్డమ్ | 39.7 |
| యునైటెడ్ స్టేట్సు | 29.3 |
| జర్మనీ | 38.1 |
| ఫ్రాన్సు | 31.2 |
| కెనడా | 26.9 |

మనదేశములో పనిచేయు వయోజన (Adults) సంఖ్య ప్రజాసంఖ్యలో 4 o/o ఉండును. క్రమనిర్మాణపరిశ్రమలందు బనిచేయువారు 1500,000 లేక 0.5 o/o.

పైనజూపిన వ్యత్యాసపరిశీలనమువలన ముఖ్యముగ తెలియు విషయమేమనగా ఇతరదేశములందు కర్షక ప్రజాసంఖ్య అంతకంతకు, పారిశ్రామిక విధానము వలన సన్నగిల్లుచు, పరిశ్రమలభివృద్ధి జెందుచున్నవి. కాని భారతదేశమందట్లుగాక అట్టి పారిశ్రామిక విధానములేకుండుటచే వ్యవసాయదారుల సంఖ్య నాడునాటికభివృద్ధిజెందుచున్నది.

గత ఇరువదిసంవత్సరములలో, హిందూదేశమునందు జనసంఖ్య 38 మిలియనుల (మూడుకోట్ల ఎనభైలక్షలు)వరకు పెరిగినది. కర్షకులసంఖ్యయే హెచ్చినదిగాని ఇతరమగు ఉత్పత్తులు, వృత్తులు మొదలగువానిలో పనిచేయువారి సంఖ్య చెప్పదగినంత పెరిగియుండలేదు. ఈవిషయమునుగూర్చియే "క్యాపిటల్" సంపాదకులు కలకత్తా 'రోటరీక్లబ్బు'లో నీక్రింది విధముగా జెప్పియున్నారు. "ఇంత స్వల్పకాలములో నింతవిస్తారమగు జనాభివృద్ధి ప్రజల సగటు ఆదాయమును, జీవనస్థితిని తగ్గింపకుండనుండజాలదు."

ఈక్రింది పట్టికలో ప్రపంచమందు మిక్కిలి అభివృద్ధినొందుచున్న దేశముల పారిశ్రామికములైన నికరపు. వార్షికాదాయములు ఇండియాతో సరిపోల్చి చూపబడినవి:

### వార్షికాదాయము

| దేశము | పరిశ్రమల నుండి రాబడి | కృషినుండి రాబడి | మొత్తము |
|---|---|---|---|
| | రు. | రు. | రు. |
| అమెరికాయునైటెడ్ స్టేట్సు | 1,300 | 286 | 1,586 |
| కెనడా | 1,047 | 464 | 1,511 |
| యునైటెడ్ కింగ్డమ్ | 808 | 80 | 888 |
| స్వీడన్ | 384 | 129 | 513 |
| జపాను | 120 | 85 | 205 |
| ఇండియా | 13 | 67 | 80 |

హిందూదేశమునందు పరిశ్రమలనుండి వచ్చు నాదాయము వ్యవసాయమువలన వచ్చు నాదాయములో నైదవవంతున్నది. గ్రేటుబ్రిటనులో వ్యవసాయాదాయమునకన్న పారిశ్రామికాదాయము పదిరెట్లున్నది.

అమెరికాసంయుక్తరాష్ట్రములందు, కెనడాలోను, భోజనపదార్థములయు, పచ్చివస్తువుల యుత్పత్తియు విస్తారముగనున్నను- వారికి ముఖ్యముగ ధనార్జనముగలుగునది, భూములనుండి, అడవులనుండి, గనులనుండియు కాదు. కర్మాగారములనుండియే వారికి ధనసంపాదనము విశేషము.

ఒకదేశముయొక్క జీవనస్థితి ఆదేశపు ఉత్పత్తులనుబట్టియు, రాబడినిబట్టియు నుండును. ఉత్పత్తి అభివృద్ధినందు కొలదియు, దానితోపాటు జీవనస్థితి వృద్ధిజెందును. అట్లుగాక ప్రజాసంఖ్యమాత్రమే పెరుగుచు, ఉత్పత్తి యథాస్థితినున్నయెడల సామాన్యప్రజలు స్వల్పజీవనులుగావలసివచ్చును. ప్రస్తుతము భారతదేశ మీస్థితియందున్నది. ఇప్పుడు మన దేశములోగల జీవనస్థితి చాల నికృష్టముగనున్నది. దానిని యుక్తముగ హెచ్చుచేయవలయునన్నచో నెక్కువ యుత్పత్తి యవసరము. జనాభివృద్ధియు రాబడితో సరిజూచినయెడల, మిక్కిలి వేగముగ పెరిగిపోవుచున్నది.

ఆర్థికశాస్త్రవేత్తల సూచనలవలన తక్కిన దేశములకన్న భారతదేశముయొక్క సగటు ఆదాయము చాలతక్కువయని విదితమగును. కాని యీస్థితికి మాత్రము చైనా మనకుతోడుగలదు. మనదేశమునందు రాబడికి సంబంధములేకుండ జనసంఖ్య పెరిగిపోవుచున్నది.

అనుభవశాలురగు పలువురు పరిశీలకులు పల్లెటూళ్ళలో ననేకమంది, చాలీ చాలని ఆహారముపై నాధారపడియుందురనియు, శిశుమరణములు హెచ్చుగానున్నట్లును దెలుపుచున్నారు.

## పరిశ్రమల ప్రాముఖ్యము.
## (Importance of Indnstries)

ఎనుబదితొంబది సంవత్సరముల క్రిందట గ్రేటుబ్రిటను, పరిశ్రమలయందును, యంత్రసహాయకమైన ఉత్పత్తియందును, నౌకావ్యాపార వాణిజ్యములందగ్రస్థాన మలంకరించియున్నది. గ్రేటుబ్రిటను యొక్క పారిశ్రామికధనాభివృద్ధిని గాంచి, జర్మను, ఫ్రెంచి, బెల్జియము, స్వీడను, దేశస్థులు మున్నగు వారందరును దాని ననుకరించి, పరిశ్రమ లభివృద్ధిపరచుకొని తమతమ దేశముల నభివృద్ధిజేసికొనిరి. వీటినిజూచి, అమెరికా, కెనడా, జపానుదేశములు గూడ, పరిశ్రమలు సాగించినవి. ఈదేశములన్నియు, పరిశ్రమ లభివృద్ధిపరచుకొని ధనవంతములైనవి. ప్రపంచములో ముఖ్యమగుదేశములన్నియు, పరిశ్రమాభివృద్ధియం దాతురతజూపుచు, పరిశ్రమలు నాగరకతాచిహ్నములలో ముఖ్యమగు దానిగ భావించుచు వచ్చినవి.

ఈప్రపంచకృషి సంచలనములలో హిందూదేశము మాత్రము స్తబ్ధముగ నిలిచియుండుటనుబట్టి దినదినాభివృద్ధినందుచున్న పశ్చిమదేశములకంటెను, జపానుకంటెను, మిక్కిలి నిరాధారస్థితికి వచ్చుచున్నది. గతశతాబ్దియందొకప్పుడు, భారతదేశము, నూలువస్త్రములు, పంచదార, ఉక్కు, ఐరోపాకును, ఇంగ్లండునకుగూడ ఎగుమతిజేసియున్నది. కాని యిప్పుడన్నియో ఆవేవస్తువులను, ఆదేశములనుండియు, మరికొన్ని యితర దేశములనుండియు, దిగుమతిజేసికొనుచు, షుమారు 50 మొదలు 70 కోట్ల రూపాయలవరకు విదేశములపాలు జేయుచున్నది. 1898 సం॥లో జపానుదేశములోని 'యోకహామా', 'క్యూటో' మొదలగు ముఖ్యస్థలములలో బొంబాయిలో తయారుకాబడిన నూలు, నూలువస్త్రములు అమ్మ భారతవర్తకులుండెడివారు. కాని ప్రస్తుత మీవిధానము తల్లక్రిందులైనది. జపానుదేశమే నేడావస్తువులను భారతదేశమున కెగుమతిజేయుచున్నది.

ప్రతిదేశమునకు వ్యవసాయవృత్తి అవసరమేయైనను, కేవలము కర్షకవృత్తివలన ప్రస్తుతకాలమందేదేశమును భాగ్యవంతముకాలేదు. హిందూదేశములో భూమిమీద నాధారపడువారిసంఖ్య పెరిగి, ఒత్తిడి యెక్కువగుచున్నది. కాని వ్యవసాయపద్ధతులు మారక పూర్వమువలెనే యుండుటవలన, అధిక వ్యయమును, స్వల్పలాభమును గలుగుచున్నది.

'మాంటాగు - చెమ్సుఫర్డు నివేదిక' (The

Montague-Chelmsford Report) భారతదేశమందలి వ్యవసాయవృత్తిని దైవాధీనమైనదిగ భావించుచున్నది. దానివలన గడించెడి లాభము శూన్యమును వ్యయమెక్కుడునగుటచే రైతుల ఋణబాధ హెచ్చినది. 1911—1931 సం॥ లో తయారుకాబడిన లెక్కలనుబట్టి, పాశ్చాత్యదేశములు, జపాను, వ్యాపార పరిశ్రమలయందు నిమగ్నులైయుండ, హిందూదేశము మాత్రము వ్యవసాయమునందే ముఖ్యముగ దృష్టిని నిల్పుచు వచ్చినట్లు తెలియును.

అమెరికా సంయుక్తరాష్ట్రములందు, వ్యవసాయమును, జనసంఖ్య విస్తారముగ పెరిగినప్పటికిన్ని పల్లె ప్రాంతములందు మాత్రము గతముప్పది వత్సరముల నుండియు, జనాభివృద్ధిగాక అట్లేనిలిచియుండి, యంత్రసహాయమువల్లను, ఇతర నూతన పరికరముల వల్లను, వ్యవసాయమభివృద్ధినంది, ఉత్పత్తి, ఆదాయములు హెచ్చినవి. ప్రపంచయుద్ధానంతరము అమెరికాదేశములో వ్యవసాయోత్పత్తి జనసంఖ్యకన్న 50 o/o వృద్ధినందినట్లు అంచనావేయబడినది.

1900 సం॥ లో అమెరికాఖండమందు వ్యవసాయమునుండి వచ్చురాబడియు, పరిశ్రమలనుండి వచ్చురాబడియు కొంచెమెంచుమించుగ సమానముగ నున్నది. కాని తదనంతర మాదేశము పరిశ్రమల నన్ని విధముల పెంపొందించి, వ్యవసాయమునకన్న నాల్గురెట్లాదాయమును పరిశ్రమల మూలమున గడించుచున్నది, అదేవిధముగా, జపానుదేశముకూడ పరిశ్రమ లభివృద్ధిపరచి 1914—1926 సం॥ లోపున 1 నుండి 7 బిలియనుల యన్నుల (Yen=2s. ½d= రు 1-5-5) వరకు ఆదాయమును పెంచుకొన్నది. అనగా పంన్రెండు సంవత్సరములలో వార్షికాదాయమును ఏడురెట్లభివృద్ధిజేసికొన్నది.

వీటినిబట్టి చూడగా ఆర్థికాభివృద్ధికి పరిశ్రమలు ముఖ్యాంగములని తెలియవచ్చుచున్నది. ఇతర దేశములతో మనదేశమును పోల్చిచూచినచో పరిశ్రమలందు మనకుండు. అశ్రద్ధ, మాంద్యములవలన మనదేశ మిట్టి దరిద్రదశకు వచ్చెనని తోచకమానదు.

## సమస్యాపరిష్కారము-రాష్ట్రములఅసమర్థత
## Failures of Provinces to Solve the Problem

భారతశాసనసభయం దీ నిరుద్యోగసమస్య 1926 సం॥ లో చర్చింపబడినది. ఆసంవత్సరమే ఆగస్టు నెలలో ఇండియా ప్రభుత్వమువారు, రాష్ట్రప్రభుత్వములవారికి, ఆచర్చల నివేదికలను బంపుచు ఈసమస్యా నివారణకు స్థానికప్రభుత్వమువారు, అందు ముఖ్యముగ ట్రాన్సుఫరు శాఖవారు. అవలంబించు పద్ధతులే సరియైనవగునని సూచించిరి. అంతేగాక కేంద్రప్రభుత్వము వారీ సమస్యా తైక్ష్ణమును దగ్గింపదలంచ లేదనియు, నిది త్వరలో పరిష్కరింపబడవలసిన ముఖ్య విషయమని గుర్తించితిమనియు, అయినను భారతశాసన సభవారి సూచన ప్రకారము, ఒక సెంట్రలుకమిటీని యేర్పరుపవలసిన యవసరము తమ కంతగ లేదనియు, స్థానికప్రభుత్వమువారే యెక్కువ బాధ్యతవహింపవలసియున్నదనియు చెప్పుచు, అంతటితో తృప్తివహించిరి.

అందుపైనను, ప్రజాపీడనవల్లను, కొన్నిస్థానిక ప్రభుత్వములు, సమస్యావిచారణకు గడంగినవి. ఇంతకుపూర్వమే వంగప్రభుత్వ మేర్పాటుచేసిన కమిటీ వారు 1924 సం॥ లో ఒక నివేదికను ప్రచురించిరి. ఇట్లే ఇండియా ప్రభుత్వమువారి ప్రకటనపై మదరాసు ప్రభుత్వముచే నిర్మింపబడిన కమిటీ 1927 సం॥ లో ఒక రిపోర్టు ప్రచురించినది. అట్లే పంజాబు ప్రభుత్వ మేర్పరచిన కమిటీ మరియొక రిపోర్టు 1928 సం॥ లో ప్రకటించెను. 1927 సం॥ లో బొంబాయి ప్రభుత్వమువారు ఆ రాష్ట్రమందలి మధ్యమతరగతుల వారి నిరుద్యోగసమస్యా సంబంధికములగు లెక్కలు ప్రకటించిరి.

ఆయారాష్ట్ర ప్రభుత్వ ప్రకటనలయందలి యీ క్రింది విషయములు చూడదగినవి.

మదరాసు ప్రభుత్వము :—'అనేక కారణముల వలన సంభవించిన యీ నిరుద్యోగదుస్థితి, ఏతరగతి వారికి జెందినదైనను, బహుక్లిష్టమైనదియు, అది

ప్రజాబాహుళ్యము చేతనే నివారింపబడవలెననియు సూచించిరి. వ్యవసాయము జీవనాధారముగ నుండునట్లు ప్రచారము చేయవలెననియు, ఈదుస్థితి నొక్కమారుగ నిర్మూలించుట బహుకష్టమనియు, ఇదియంతయు చక్కబెట్టుటకు చాలకాలము పట్టుననియు'' నివేదించినది.

వంగప్రభుత్వము:—''దేశాభ్యుదయము చురుకైన పరిశ్రమాభివృద్ధిపై నాధారపడియున్నదని దృఢాభిప్రాయమును వెలిబుచ్చుచున్నాము. ఇంకను, వ్యాపారము, కోలనీలు, ఇండస్ట్రియలుబ్యాంక్సు, సాంకేతికాభ్యాసక విద్యలను వృద్ధిచేయవలెనను కొన్ని ఆనుసారిక విధానములను సూచించిరి. సాంకేతికాభ్యసనము, ఆర్థికాభివృద్ధియు, నొకదానినొకటి బలపరచుచు, సంతృప్తికరమగు నున్నతస్థితికి రావలెను. దేశీయార్థికాభివృద్ధి మిక్కిలియు ప్రాముఖ్యవిషయమే, యైనను అది తమపని' గాదని ముగించిరి.

పంజాబుప్రభుత్వము :—''సర్వసామాన్యములగు పెక్కువివరణలు గావించిరి. ప్రస్తుతవిద్యావిధానము, సేవావృత్తికిమాత్రము పనికివచ్చువారిని తయారుచేయుచున్నదనియు, ప్రభుత్వోద్యోగముల కింతకు పూర్వమాసించని జాతులయం దీవిద్య యెక్కువగుట చేతనే నిరుద్యోగసమస్య ప్రబలినదనియు, ఈవిద్యాసౌకర్యములు బీదలగుచో నర్హులకును, సమర్థులకును, ఇతరులలో విద్యావ్యయములు భరింపగలుగు వారికి మాత్రమే కూర్చవలసినదనియు మున్నగు సూచనలు చేయుచు, నిరుద్యోగసమస్య అనుభవ (ఔపయోగిక) విద్యలేక కేవల గ్రంథపాఠకులగు విద్యావంతులలో మాత్రమే కొంచెమున్నదనియు, సామాన్యప్రజల నిది యంతగ బాధించుటలేదనియు వ్రాసిచ్చిరి. వారిలో నొక్కసభ్యుడు మాత్ర మీక్రింది విధమున వ్రాసియుండెను.

ప్రభుత్వమువారిచే ఆరంభింపబడి, ప్రచారము సలుపబడు, పారిశ్రామిక విధానమునందే నిరుద్యోగసమస్యా నివారణ చేకూరగలదు. ప్రకృతము పరిశ్రమలందు తగు శ్రద్ధవహింపబడుటలేదు. పారిశ్రామిక సాంకేతిక విద్యాభివృద్ధికి తగినంత, తగినన్ని ఏర్పాటులేమియు లేవు.''

తిరువాన్కూరు :—సందర్భవశముగా తిరువాన్కూరు సంస్థాన ప్రకటనముగూర్చికూడ నిచ్చట ముచ్చటించుట ఉచితము. ఇతర సూచనతోపాటీ నివేదిక ఆర్థికాభివృద్ధిని నూతనవిధానములచే పెంపొందింపవలసినదిగ సూచించినది. ఇట్టి అభ్యుదయము ప్రధానవిషయముగ నుండవలెననియు, ప్రస్తుత ప్రభుత్వ వివిధకార్యములలో నొకటిగ నుండరాదనియు నానివేదిక స్పష్టీకరించినది.

మొత్తముమీద నీనివేదికలన్నియు, మధ్యమ తరగతి ప్రజల నిరుద్యోగస్థితిని గూర్చియే వివరించినవి. సమర్థులగు నీమధ్యతరగతి ప్రజల నిరుద్యోగసమస్య పరిష్కారమైనచో, తక్కిన ప్రజాబాహుళ్య సమస్య సహజ జనితము గానిదిగనుక వెంటనే దానంతటదియే చాలవరకు పరిష్కారము కాగలదు.

రాష్ట్రప్రభుత్వములవారి నివేదికలపై క్రియారూపకమైన యేవిధమైన విధానము నవలంబించి యుండినట్లు కనబడదు. భారత ప్రభుత్వమువారు తామొకప్పు డవసరమగుచో చేయదలచినట్లు, ఈనివేదికలన్నిటిని జతపరచి 'కేంద్రసంఘము' వారితో సంప్రదించి యుండినచో, నీసమస్య నింకను ప్రజాబాహుళ్యము కండ్లయెదుట నుంచియున్నచో, కొంతమేలు కలిగియుండెడిది. కాని ప్రభుత్వమువారు విధాన మవలంబించిరి !

## నివారణలు (Cur

ఈ నిరుద్యోగసమస్యా పరిష
జరుగుటకు దేశపరిస్థితులంతగ
విధముల దేశము హీనదశయ
సాంఘికముగ రాజకీయముగ
కారణ జనితమగుటచే ప
న నేగాని యీపీడ వీడదు
యమాలేదు. ప్రజలలో
సానుభూతి సహాయ
కృషిగాని, వృత్తి

నందుట కష్టము. అవి యభివృద్ధినందిన గాని యీ దుస్థితి తొలగదు. అయినను కొన్ని విధానములు లేకపోలేదు. హద్దులేక పెరిగిపోవుచున్న ప్రజా సంఖ్య సంతాననిరోధ విధానములచే తగ్గింపవచ్చును. ప్రతివాని జీవశక్తి దేశాభివృద్ధికొరకు వెచ్చించబడ వలెను. విద్యావిధానము మారి, జీవితములో పనికి వచ్చునదిగ నుండవలెను. వీనికితోడి క్రింది విష యము లభివృద్ధినందుచో దేశము మరల సుభిక్షము కాగలదు. ముఖ్యములు పరిశ్రమాభివృద్ధి, గ్రామ పున రుద్ధరణము.

1. గృహపరిశ్రమలు:—వీని నభివృద్ధిపరచుట తేలిక. ఇదివరకే వీనికి ప్రజలలవడియుండుటచే సుల భముగ పునరుద్ధరింపవచ్చును. వీనికి పెట్టుబడియు, విస్తారమవసరములేదు. పురపాలక సంఘములు ఇతర సంస్థలు వీనిని ప్రోత్సహించి, వలయు సౌకర్యములు చేకూర్పవలెను.

2. గ్రామపునరుద్ధరణము :—వ్యవసాయ మ ను, గృహపరిశ్రమలను అభివృద్ధిపరుపవలెను. పరస్పర సహాయమువలనను, సహకారమువలనను నీ విషయ ము లభివృద్ధిజెందవలెను. నూతన విధానముల మూల మున ఉత్పత్తి పెరుగుచుండవలెను. వ్యయము తక్కువ ఫలమధికము నిచ్చు విధానము లవలంబింప బడవలెను. కాలము వృధాపుచ్చుచుండు కర్షకు లకు, విశ్రాంతి సమయములందు చిన్నిచిన్ని పరి శ్రమ లలవడ జేయవలెను.

3. అనుభవ (ఔపయోగిక) శాస్త్రవిద్య:—పయోజనులను, యువకులను, ఏదేయొక వృత్తిపై జీవనము సేయజాలుట కుపయోగించు, ననుభవము గలుగజేయుటకు, ప్రతి పట్టణమునందును, పల్లె యందును, విద్యాలయములు నిర్మింపబడవలెను. ఆ విద్యాలయము లైదారుమాసములలో వారిని సమర్థు లుగ తయారుచేయజాలి యుండవలెను.

ఇన్నింటను పరిశ్రమాభివృద్ధియే ముఖ్యము. వ్యవ సాయమువలన వచ్చు నాదాయము, ఉదరపోషణకు మాత్రమె జాలియుండును. కాని పారిశ్రామికొదా య మట్లుగాక నిలువయుంచుకొనుటకు గూడ వీలు గలుగజేయును. మనదేశీయులందరు నిరంతర కృషి వలననే అభివృద్ధిలోనికి రావలసియున్నది.

ఎన్నెన్ని విధానము లవలంబించినను, రాజకీయ స్వాతంత్ర్యములేనిదే ఆర్థికదుస్థితి తొలగిపోయి దేశా భ్యుదయము గలుగుట దుస్సాధ్యము !

మద్రాసు నేషనల్ మువీటోన్ లిమిటెడ్ కంపెనీ

వారి ప్రథమ పౌరాణిక చిత్రరాజము

# MOHINI RUKMANGADA

మరపురానిదియు హృదయమునుప్పొంగచేయు గానము

గొప్ప నీతిని బోధించునదియునగు చిత్రము.

ముఖ్య పాత్రధారులు :

| | |
|---|---|
| వేమూరి గగ్గయ్య | డి. రామచంద్రరావు |
| పులిపాటి వెంకటేశ్వర్లు | ఘంటశాల శేషాచలం |
| చిత్రపు చలపతిరావు | కాయల సుబ్రహ్మణ్యం |
| వేమూరి పరబ్రహ్మశాస్త్రి | కంచి నరశింహారావు |
| కుంపట్ల సుబ్బారావు | రామతిలకం |
| యడవల్లి నాగేశ్వరరావు | కృష్ణవేణి |
| తాడి సూర్యనారాయణ | దుర్గాకుమారి |
| టి. రామకృష్ణశాస్త్రి | రత్నం |
| సుసర్ల రామచంద్రరావు | ప్రేమావతి |

డైరెక్టరు :

చిత్రపు నరశింహారావు.

అసిస్టెంటు డైరెక్టరు :

చిత్రపు నారాయణమూర్తి.

కవి :

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు.

మ్యూజికల్ డైరెక్టరు:

భీమవరపు నరశింహారావు.

గ్యారంటి !　　　2 సంవత్సరముల　　　గ్యారంటి !!

# టి. సి. ఎన్. గోల్డెన్ మెటల్ జ్యాయలరి

## మార్టువారి వివిధరకముల గాజులు




ఈ గాజులు అచ్చంగా బంగారు గాజులలాగే కాంతితోనూ, వన్నెలోనూ మెరిసిపోతున్నాయి. నలుపు కావడము లేదు.




పెద్దసైజు గాజులు 2 యించిలు మొదలు పైబడినది. జత 1-కి రూ. 3-0-0

మధ్యమసైజు $1\frac{3}{4}$ ఇంచి మొదలు 2 ఇంచిలకు లోగా వుండునది. జత 1-కి రూ. 2-8-0

బేబీసైజు $1\frac{3}{4}$ ఇంచికి లోబడినది. జత 1-కి రూ. 2-0-0

వి. పి. ఖర్చులు జత మొదలు 6 జతలువరకు రూ. 0—6—0

గాజులకు ఆర్డరు చేయువారు వుపయోగించెడు వారి గాజుల చుట్టుకొలతను ఇంకితో మార్కు చేసి పంపండి.

2 అణాల ఖరీదుగల మా చక్కని బొమ్మలకేట్లాగు ఉచితము.

వలయువారు :—

## టి. సి. నాగలింగప్ప అండు కంపెని,

280 వాల్‌టాక్సు రోడ్డు, పార్కుటవున్ పోస్టు, మదరాసు.

ఏజంట్లు:—(1) పటేలుస్టోర్సు, మ్యునిసిపల్ హైస్కూల్ రోడ్డు, బెజవాడ.

(2) మహమ్మద్ బసిరుద్దీను సాహెబ్, మెటల్‌జ్యాయలరిషాప్, మెయిన్‌రోడ్, నిడదవోలు (పశ్చిమగోదావరిజిల్లా.)

(3) జయభారతి వస్త్రాలయము, మెయిన్‌రోడ్, ఏలూరు.

# అద్భుత వివాహములు

రచయిత:

శ్రీ గిడ్రాజు రామారావు

భారతదేశములో నెనిమిదిరకముల వివాహపద్ధతులున్నవని యందరకును తెలిసినవిషయమే. ఇక నితరదేశములలోని పద్ధతులు తెలిసికొనినచో మనకు వింతగదోచును గనుక వినోదార్థముగా నియ్యది వ్రాయబడినది.

దేవతలతో వివాహము

ఉత్తరబర్మాలో న్యాంగటాంగ్ అను ఒక నదికలదు. అచ్చట చాల శౌర్యముగల ఒక జలదేవత నివసించుచుండును. ప్రతి సంవత్సరము దానిని సంతృప్తిపరచుటకుగాను ఎనిమిదవనెలలో దానిపేర పూజలు జరుగుచుండును. ఇంతియేకాదు. దానిని సంతృప్తిపరచుటకుగాను ప్రతి మూడు సంవత్సరముల కొక్కసారి నలుగురు అందకత్తెల నాదేవతకిచ్చి వివాహముచేయుదురు. వివాహమునకు పూర్వము హకాన్‌జాతి సుందరీమణులందరును రాజాజ్ఞప్రకారము నదియొద్దన జేరుదురు. వారినుండి మిక్కిలి యందకత్తెలు నలుగురెన్నుకొనబడుదురు. ఎన్నుకొనబడనివా రపవిత్రులుగా భావింపబడుదురు. ఆనలుగురు రూపవతులు పిమ్మట రాజమహలునకు పంపబడుదురు. వారచ్చట నాలుగురాత్రులు గడుపుదురు. మూడుసంవత్సరములవరకు వారు పతివ్రతలుగానుండి పిమ్మట నెవరింయిష్టాను సారము వారు వివాహముచేసికొందురు.

ఆఫ్రికాలో విక్టోరియానాన్‌జ అను నదియొకటి గలదు. ఆప్రదేశములోనివారా నదిలో తరచు ప్రయాణములు చేయుచుందురు. జలదేవత వారికేవిధమైన అపాయమును కలిగింపకుండుటకుగాను వానికొక పిల్ల నంటగట్టెదరు. జలదేవతను వరించినపిల్లలు మరల వివాహముచేసికొనరు. వారు దేవతాస్త్రీలుగా భావింపబడుదురు. ఆయలవాటిప్పుడులేదు. కారణము అచటివారిప్పుడు క్రైస్తవమవలంబనముచేయుటయే.

ఆంగ్లేయులు రాకపూర్వము ఆఫ్రికాలో 'అకికుయు' అను జాతిగలదు. వారు నాగోపాసకులు. వారిపేర్లు 'నాగయీ' అని యుండును. వారిలోకూడ నీయలవాటుకలదు. వివాహమునకుముందు ఒక నదియొద్దన కొన్ని గుడిసెలను వేయుదురు. ఎన్నుకొనబడిన పిల్లలా గుడిసెలలో నుంచబడుదురు. ఈపద్ధతి ఆ కన్యలకు ఇష్టములేకపోయినను సరే వానిని బలవంతముగానే పంపుదురు. అనేకమంది యువతుల కొకేరాత్రి కల్యాణము జరుగును. వారికి కలుగు సంతానము నాగసంతానమట! తండ్రి నాగదేవుడు, తల్లినాగిని సంతానమునకదేపేరు.

నీలనదియే ఈజిప్టుదేశమునకు జీవనము. ఆనది లేనిచో నాదేశము స్మశానభూమితో సమానము. ఆనదివలననే ఆభూమి పవిత్రమగుచున్నది. ఆనది ఎంతపొర్లుకొనుచు వచ్చి

న వారికంత యానందము. నది పొంగుచున్న సమయములో వారు నదితో ఒకపిల్లను వివాహము చేయుదురు. ఆయలవాటిప్పుడు లేదు. ముసల్మానులు దీనిని మాన్పించిరి.

ఆస్ట్రేలియాకు ఉత్తరముగానున్న ద్వీపములలో మొసళ్ళు విస్తారము. అప్పుడప్పుడు నదీముఖద్వారమునగల చిన్నపల్లెలలో ప్రవేశించి మనుష్యుల నీడ్చికొనిపోవును. అందువలన తిమరద్వీపవాసులు మొసలిని దేవతగా భావింతురు. వారిరాజు మొసలివంశజుడేయట! క్రొత్తగా రాజ్యభారము వహించిన రాజు ముందు మొసలిని బూజించును. అదియేకాదు. మొసలి దేవునకు "మనుష్యభార్య" నిచ్చినచో నతడు సంతృప్తిపడునట. అందుకై రాజుగారి యాజ్ఞానుసారము ఒక కన్యను నదియొడ్డున నొకరాతిపై గూర్చుండబెట్టి మొసలిదేవు నుచ్చరించుచు వివాహమంత్రములు పఠింతురు. వెంటనే యెచ్చటనుండియో నొకమొసలి యా యభాగ్యురాల నీడ్చికొనిపోయి భుజించును. జనులందరు ఈ విచిత్రమును చూచుచు కొంతకాల మచ్చటనే వేచియుందురు. ఎందుకనగా, తామిచ్చినకన్య మకరదేవునకు నచ్చనిచో తిరిగి పంపివేయునట! కాని మొసలికి నచ్చనిభార్య ఇంతవరకు ఎన్నడును కానరాలేదు. ఈపద్ధతి కూడ క్రమక్రమముగా తగ్గిపోయెను. ఉత్సవములు మాత్రము జరుగుచునేయున్నవి. కాని కన్యను మొసలివాత వేయుటలేదు. మకరదేవుని ప్రతినిధి పురోహితున కాపిల్ల ఇపుడు దక్కుచున్నది.

ఈద్వీపమునకు చుట్టుప్రక్కల చిన్నచిన్న ద్వీపము లెన్నియో కలవు. వానిలో మానవ సంఖ్యకంటె మకరసంఖ్యయే మెండు. ఒక నాడు వీరిలోని పెద్దకు కలలో మకరదైవము కన్పించి తాను మానవకన్యను వివాహమాడు నుద్దేశ్యము వెలిపరచెను. అందులకై ప్రతిసంవత్సరము ఒక అందకత్తెను నదిలో పారవైచి మంగళంపాడుచుందురు.

హిందూమహాసాగరములోని మలయా ద్వీపములో భాస్వరసంబంధమైన ప్రకాశము కనుపించును. ఆదేశములోని రాక్షసియే ప్రతిసంవత్సరము నీరూపమున కనుపించుచుండు నని వారుతలంతురు. వానికుచితరీతి నర్ఘ్య పాద్యము లీయనిచో నతడా దేశమున కుపద్రవము తెచ్చిపెట్టుటనిజము. అతనికన్నిటికంటె ప్రియమైనవస్తువు అందమైనపిల్ల. అందులకై ప్రతినెల సముద్రపుటొడ్డున నొకపాకవైచి దానిలో నొకపిల్లను కూర్చుండబెట్టుదురు. అచ్చట "జన్ని" (రాక్షసిపేరు)తో బ్రహ్మవిధితో వివాహముచేయుదురు. ఆరాత్రి యాపెనచ్చటనే విడచిపోదురు. మరునాటియుదయమున నాగుడెసెలో నెవ్వరును కనుపింపరేమి చిత్రమో! ఇప్పుడు మలయాద్వీపములో చాలవరకు ముసల్మాను మతావలంబకులు కాన యీపద్ధతి పూర్తిగా రూపుమాసిపోయినది.

చీనాదేశములో టాంగ్ రాజుల కాలములో ప్రతిసంవత్సరము ఒకపిల్లను సముద్రునకిచ్చి వివాహముచేయుచుండెడివారు. వివాహానంతర మాపిల్లను సముద్రములో త్రోసివేయుదురు. కొంతకాలమునయిన పిమ్మట ఒక దయాస్వరూపుని రాజ్యకాలములో నీపద్ధతి నిలిపివేయబడెను కాని మూలమూలల జరుగుచునేయుండెను. ఒకనాడు రాజు వారినందరను పిలచి "నాకు రాత్రికలవచ్చెను. దేవతలకిక పిల్లలుచాలునట. ఇంతవరకు పిల్లలనిచ్చిన ధర్మధాతలలో నొక్కడు సముద్రునికి కావలెనట" అని చెప్పెను. కాబట్టి 'మీలో

ఎవ్వడు సిద్ధముగానున్నాడో త్వరగా తెల్పుడు లేనిచో నందరిని సముద్రమున త్రోయింతును' నెను. అందరును ఏడువ మొదలుపెట్టిరి. రాజు వారలనందరిని సముద్రమున త్రోయించెనట!

(Frazer, The Golden Baugh)

### జడపదార్థములతో వివాహము

హిమాలయముల పశ్చిమకోణమున నొక యులవాటు కలదు. కన్యయొక్క జన్మనక్షత్రము సరిగాలేకున్నను, పిల్లకు పిచ్చియున్నను, అంగవైకల్యముకలిగియున్నను ఆమెను మొదట ఒకజలపూరమైనకుండకు కట్టి శాస్త్రోచితముగావివాహముచేయుదురు.

పోర్చుగీసులో గోయాప్రదేశములోని నాట్యకత్తెలు, వారివృత్తి ప్రారంభించకపూర్వము ఒకకత్తిని వివాహమాడుదురు.

దక్షిణ కొచ్చిన్ రాజ్యములో దేవదాసీలు ప్రప్రథమమున ఒకవిధమగు కత్తితో వివాహముచేసికొందురు. అటుపిమ్మట వారు వివాహముచేసి కొనరు.

అమెరికాలో ఆల్‌గన్‌జ్విన్సు అను పల్లెజాతికలదు. వీరు ఒకనాడు చేపలవేటకై పోయి పట్టదలచినయొక్క చేపనుమాత్రము పట్టజాలకపోయిరి. వారు కారణము నూహింపలేక దైవప్రార్థన మొదలిడిరి. అప్పుడు జలదేవత మనుష్యాకారమున ప్రత్యక్షమై “నేను జలదేవతను. నేనిప్పుడు భార్యలేకుండా అల్లాడుచున్నాను. నాకు మంచిపిల్లనొకదానినీయుడు. ఆపిల్ల పతివ్రతగా నుండవలెను. అప్పుడే మీకు కావలసినన్ని చేపలు లభించును’’ అని పలికెను. వెంటనే యాపల్లెవారు 8 సంవత్సరముల బాలిక నొకదానిని బట్టి జలదేవతకు గట్టిరి. అప్పటినుండియు వారికి చేపలు విరిగావి దొరకుచుండెనట, ఈవార్తవిని హురన్ జాతివారుకూడ నట్లేచేయ మొదలిడిరి. ఈయులవాటు నేడుకూడ సాగుచునేయున్నది.

మనదేశములో సముద్రుడు మొగుడుగాను, వానిభార్య నదిగాను భావించుట కలదు. ఈరెంటికిని వివాహములుగూడ జరుగును. పాశ్చాత్యులకట్లుకాదు. సముద్రము స్త్రీ. వెన్నిస్‌నగరము భూమధ్యసాగరమున గలదు. అందువలన వారికి సముద్రములన్నిటిపై యధికారముగలదట! వారు వేలుచూపి సముద్రుని యాజ్ఞాపించుచుండెడివారు. అచ్చటి ప్రధానశాసనకర్త ప్రతిసంవత్సరము సముద్రమును వివాహముచేసికొనును.

### పక్షులతో సంబంధము

ఎవనికైనను వరుసగా ముగ్గురు భార్యలు చనిపోయినచో మరల వివాహము చేసికొనుటకు పూర్వము అతను ఒకపక్షిని వివాహమాడును. ఆపక్షి వివాహమునకు తయారగు కన్యయొద్దనే యుండును. అనగా పెండ్లికూతురి బిడ్డయని భావము. కట్నము కానుకలన్నియు పక్షికే చెల్లింపబడును. కొంతకాలమునకు పిదప నాకన్య వానిస్వాధీనమయి పోవును.

(Crook, Folk lore of Northern India)

### మనుష్యులతో వివాహము

ఇందు వింతయేమికలదని అనవద్దు. బెంగాలులో వారేంద్రవంశీయులను నొకతెగ గలదు. వీరు బ్రాహ్మణులు. పిల్లలకు వరులు దొరకుట కష్టము అందువలన బాల్యావస్థలోనే తమకులములోని యొకరికిచ్చి వివాహము చేయుదురు. ఈ వివాహమునకు వరుడు లేడు. అయినను వివాహసంస్కారమువలన నామెకులము వంశమును నిలువబెట్టుకొనునట! వయసువచ్చిన పిమ్మట నాపిల్ల తన యిష్టమువచ్చిన వానిని జేసికొనును.

యూరోపులో వధువు వరునికంటె వయసులో పెద్దదయినను, వరుడు ఇల్లు విడకముండ వలసినను, వరుడు తన ప్రతినిధిని పంపించును. ప్రతినిధియే కన్యను వివాహమాడును. ఆ రాత్రి వారిద్దరును గదిలోనికి బంపబడుదురు కాని వరుడు తనచెప్పులను బయటనేవదలి వేయును. వీరిద్దరును మంచముపై పండుకొనినపిదప వీరికాళ్ళను కట్టివేయుదురు. పిమ్మట పురోహితుడు మంత్రపఠనము కావించును. అయ్యది పూర్తియయిన పిదప వరుడు వదలి వేయబడును. అనుకూలసమయమును జూచి అసలు మొగుడు లోనప్రవేశించును. ముసల్మానులలోగూడ ప్రతినిధులను పంపుట ఆచారములోనున్నది.

(Tennyson, The Princes Canto I)

ఐరోపాయుద్ధకాలములో పెండ్లి బేరములు జరుగుట చాల కష్టముగానుండెను. అందువలన ఫ్రెంచివారొక శాసనమును చేసియుండిరి. సైనికుడెవడైనను తానువలచిన కన్యను వివాహమాడదలచుచో ప్రతినిధిని పంపి వివాహము చేసికొనవచ్చును. ఈశాసనము ప్రకారము 18 మే 1916 లో ఎం. నాడకే అనువాడు ఎం. లావివ్ అను ఒక సైనికుని పంపి లిల్లీమాటిగ్నీ అను పిల్లను పాణిగ్రహణము చేసికొనెను.

యూరోపులో మరికొన్ని దేశములలో మరియొక యలవాటుగలదు. అసలు కన్యను వివాహమాడుటకు పూర్వము మరియొక కన్యను వివాహమాడి తనశక్తిసామర్థ్యములు ఋజువుపరచుకొనును. పాలోనియాలో గెడ్డము మీసము లేనివానికి, పోలండులో ముసలివానికిని, ఎస్తోనియాలో వధువుతమ్మునకును ముందుగా బొమ్మలనుతయారుచేసి పెండ్లి చేయుదురు. ఫ్రాంసులో బ్రూటానీప్రదేశములో వధువు స్థానములో నొక చిన్నపిల్లను కూర్చుండబెట్టి, దానిప్రక్కన ఒక బొమ్మను, దానిప్రక్కన ఇంటియజామానురాలను(ఆమె ఎంతముసలిదైననుసరే)కూడ కూర్చుండబెట్టి, వరునిచే ముగ్గురకు మంగళసూత్రము గట్టింతురు.

ఆస్ట్రేలియాలో ఉరావన్నా బిఇరీలు అను కొన్నిజాతులున్నవి. వారిలో వివాహపద్ధతి కడువిచిత్రముగానుండును. పిల్లపుట్టినవెంటనే వరుడు నిశ్చయింపబడును. పిల్ల పెద్దదయిన పిమ్మట అత్తవారింటికిపోవును. ఆపిల్ల ఆయింటి భార్యగాని ఇంటిలోనియువకునకెవ్వనికి భార్య కాదు. కావుననాయింటిపెద్దయే ఆమెకుభర్త. ఆమెకు పుట్టినబిడ్డలు అందరిబిడ్డలుగా ఎంచబడుదురు. ఆపిల్లలు అందరినితల్లీ, తండ్రీయని పిలచుచుండును. ఆయింటిలోని తక్కిన మగవారికిగూడ నాపిల్లపై సర్వాధికారమును బొందియుందురుకాని ఇంటిపెద్ద అనుమతిని బొందవలెను. సాధారణముగా తగాయిదా లేకుండ అందరూ సర్దుకొనుచుందురు.

ఇట్టి సమితీవివాహపద్ధతులు ప్రాచీన అమెరికాజాతులలోగూడ కలదు.

బెంగాలులో పిల్లలు శరీరశుద్ధికొరకు సాలిగ్రామమును వివాహమును చేసికొందురు. తగినవరుడు లభించినపిమ్మట మామూలు వివాహము జరుగునట!

దక్షిణ హిందూస్థానములో నొక బీభత్స వివాహపద్ధతికలదు. 16 సంవత్సరములపిల్లను 5 లేక 6 సంవత్సరముల బాలునకిచ్చి వివాహము చేయుదురు. వధువు అత్తవారింటనే యుండును. ఈవివాహము నిజముగా వరుని కొరకుకాదు. మామగారికొరకు. పిల్లవాడు పెద్దయగునప్పటికి భార్య ముసలిదియగును. ఆమెకు సంతానముకూడనుండును. ఆమెకు

పుట్టిన మగశిశువున కయిదవయేట ఈడేఱిన పిల్లనిచ్చి వివాహముచేయుదురు. ఆశిశువు భార్య ఇప్పటికి ఎదిగియుండు మామగారిని ఆనందములో ముంచుచుండును. ఈవిధముగా తరతరములవరకు సాగుచుండును. ఇట్టి పద్ధతి మనదేశమున నుత్తర పశ్చిమ ప్రాంతములందును, రష్యా, కాకేశియన్ జాతులలోను కలదు.

మనదేశములో చెట్లకు చెట్లకును, జంతువులలో జంతువులకు వివాహములు చేయుదుము. చెరువులు, నూతులు మొదలగువాని తోకూడ మనుష్యులను వివాహముచేయుట కొన్నిచోటుల యాచారము.

గ్రీకు గ్రంథకారులు మనదేశమునకు వచ్చినప్పుడు వివాహపద్ధతులను గూర్చి తెలిసికొని వారి గ్రంథములలో వ్రాసికొనిరి. వానిని తెలిసికొన్నచో ఆనాటికే భారతీయనాగరికత యెంతయభివృద్ధి చెందియున్నదో తెలిసికొనవచ్చును.

ప్రాచీనకాలమున భారతదేశమున వివాహబంధన మంత కఠినముగాలేదు కాని శ్వేతకేతుని కాలములో వివాహబంధనము నియమింపబడెను. అప్పటినుండియే వ్యభిచారము తప్పుగా పరిగణింపబడెను. 'నియోగము' తప్పులేదుకాని అయ్యది స్త్రీ భర్తయనుమతినిబడసి మనోసిద్ధికై యిట్లు పరపురుషునితో కలియవచ్చును. అది క్రమక్రమముగా తగ్గిపోయెను. పునర్వివాహము ప్రాచీనకాలములోని యాచారముకాని సతీత్వము నిలబెట్టుకొనుటకై దీర్ఘతముని కాలమునుండియు మార్పుజెందెను. అనాదినుండియు ఎక్కువమంది భార్యలను చేసికొనుట, స్త్రీలెక్కువమంది పతులను చేసికొనుట ఆచారముగా నుండెనుకాని భారతకాలమునాటికీ రెండవది తగ్గిపోయెను. చిన్నపిల్లల వివాహమున కాధారములు కనుపించవు. వివాహమునకు మూడవదినముననే భార్యాభర్తలు కలియవలెను. అనగా వివాహమప్పటికే స్త్రీలు ప్రౌఢవయస్సుగలవారై యుండిరని తెలిసికొనవలెను. బాణుని కాలములో దీనికి సంబంధించిన నియమములు మార్పుబడినవని హర్ష చరిత్రమువలన తెలియుచున్నది.

వివాహ లెనిమిదిరకములు. ఇందులో బ్రహ్మవిధితో జరుగు వివాహము తక్క తక్కినవన్నియు దుండగములేయని చెప్పవలెను. వానిని వివాహములనుటకు బదులు 'బలిదాన'మనిన బాగుండును. ఆకాలమున నెట్టి యనుచితవ్యవహారములకైనను పురుషులు వెనుదీయలేదు.

ఈవిధముగా వ్రాసిన నెంతవరకైనను పోగలదు. కాబట్టి వృధాగా కాలయాపనము జేయక విరమించుచున్నాను.



టాన్సిల్సు (గొంతులో కండలు పెరుగుట)ను ఆపరేషను లేకయే 'టాన్సినాల్' అను మందుచే కుదుర్చుట.

# టాన్సినాల్ లేబరేటరి,

53, గోవిందప్పనాయక్ వీధి, మదరాసు.

కన్సల్టింగు ఫిజీషియన్ :

డాక్టర్. డి. అప్పారావు, యల్.ఐ.యమ్. (రిజిష్టర్డు.) టాన్సిల్సు స్పెషలిస్టు.

# ఆంధ్ర ఫిలింలీగ్

[ఆధునిక ప్రపంచమునందలి వివిధవ్యాపారముల నన్నిటిని ఫిలింవ్యాపారము తలదన్ననదగుచున్నది. ప్రపంచమునందలి వివిధ దేశములందువలెనే ఆంధ్ర దేశమునకూడ ఇటీవల ఈవ్యాపారవిషయమై చలనముదయించి సముచితకార్యకలాపము సాగుచున్నది. ఈప్రారంభదశయందే ఈవ్యాపారము సక్రమమార్గమున ప్రవేశించి సవ్యముగ సాగునట్లు చక్కదిద్దుకొనవలసియున్నది. అట్లు చక్కదిద్దుకొనిననాడే ఫిలింపరిశ్రమవలని విత్తము పెట్టుబడిదారులకును, విజ్ఞానము చూపఱులకును న్యాయముగ దక్కినదగును. అట్లు చక్కదిద్దుకొనుటకు క్రింది వ్యాసమున ఏ. వి. సీతారామయ్యగారు సూచించిన ఫిలింలీగ్ స్థాపనము అత్యవసరమైనది. సీతారామయ్యగారు ఆంధ్రాంగ్ల భాషలనేర్చిన విద్యాధికులేగాక నాట్యకళను విమర్శకదృష్టితో అవలోకించిన ప్రౌఢులగుటయు ఈ విషయమున వారెట్టి ఉపదేశమునుగాని చేయుటకు సమర్థులైయున్నారు. మరియు వారిప్పుడు లక్ష్మీసినెటోన్ డైరెక్టరుబోర్డునందుండుటచే ఫిలింవ్యాపారమునుగూర్చి ఏవిషయముగాని అనుభవపూర్వకముగ చెప్పుటకు అవకాశము కలుగుచున్నది. కావున వారు తలపెట్టిన ఆంధ్ర ఫిలిం లీగ్ అచిరకాలముననే స్థాపింపబడి అవసరకార్యకలాపమునకు కడంగునుగాక అని వాంఛించుచున్నాము. —సంపాదకుడు.]

ప్రస్తుతకాలములో ప్రపంచమంతా ఫిలింపరిశ్రమ యొక్క గొప్పదనాన్ని గుర్తించింది. పాశ్చాత్యదేశాలలో దానిని విపరీతంగా అభివృద్ధిచేసుకుంటూ, ప్రభుత్వాలు సయితం దానిని అనేకరీతుల ఉపయోగించుకొంటూ లాభము పొందుతున్నారు.

విదేశములలో మాదిరే మనభారతదేశంలో గూడా పెట్టుబడిదారులు ఆపరిశ్రమను ఆశ్రయించి, ఈద్పురు వస్తున్నారు, నెమ్మదిగా.

ఇటీవలనే ఆంధ్రదేశం గూడా ఫిలింపరిశ్రమలో దుమికింది. రాష్ట్రమంతటా ఫిలింపరిశ్రమకు సంబంధించిన వివిధశాఖాసంస్థలు నెలకొల్పబడుతున్నాయి. లక్షలు లక్షలుధనము వెచ్చింపబడుతున్నది.

సక్రమపద్ధతులలో పెంపొందింపబడినట్లయితే ఇప్పట్లో దీనికి సమానమైన వ్యాపారంలేదు. టాకీతుపాను ప్రచండంగా వీచుచున్న ఈసమయంలో మన రాష్ట్రంలోని ఫిలింప్రొడ్యూసర్లు, డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటర్లు, డైరెక్టరులు, నటులు, టెక్నిషియనులు, విమర్శకులు; కనీసం సంవత్సరానికి ఒక్కమారైనా పట్టణంలో కలుసుకొని పరిశ్రమలో తమకుగల వివిధానుభవములను, కష్టనిష్ఠూరములను ఒకరి కొకరు ఎరుక పరచుకొని పరిశ్రమను అభివృద్ధిచేసి లాభము పొందుట సమంజసము.

అందులకుగాను ముందుగా 'ఆంధ్రా ఫిలింలీగ్' అని ఒకసంఘమును స్థాపించి, దానికి ప్రతినగరములోను శాఖలను స్థాపించి, ఏటేటా ఒకనగరములో ఫిలిం పరిశ్రమకు సంబంధించిన ప్రతివారునూ కలిసి ఫిలిం కన్వెన్షను నొకదానిని జరిపి పరిశ్రమయొక్క అభివృద్ధికిపాటుబడుట బాగుండునని సూచించుచున్నా

ను. దానిలో వ్యాపారములోని మంచిచెడ్డలను పారిశ్రామికులకు ప్రజాసముదాయమునకూ తెలియజేయుటయేగాక, ఇతరరాష్ట్రములలోని పరిశ్రమానిపుణులను రావించి వారివలన అనేకముఖ్యవిషయములను తెలుసుకొనుటయు, సంఘముతరఫున పత్రిక నొకదానినినడిపి నిపుణుల వ్యాసములను, పారిశ్రామికుల అనుభవములను ప్రకురించుటయు, ఇంకను అవసరములగుపనులు చేయుటయు జరుపవచ్చును.

తెలుగు ఫిలింపరిశ్రమకు ప్రస్తుతకాలము ఒక ఘట్టము. పరిస్థితులు దినదినమూ తారుమారగుచున్నవి. పరిశ్రమకు సంబంధించిన ప్రతివారునూ తమ అనుభవమునూ, శక్తినీ వినియోగించి పరిశ్రమను సక్రమపద్ధతులమీద నడిపించుటకు యత్నము చేయవలసిన అవసరమెంతేనికలదు.

సూచనలివ్వదలచినవారునూ, ఇతర వివరములు గోరువారునూ ఈక్రింది చిరునామాకు వ్రాయగోరుచున్నాను. ఇందుకు ఆంధ్రదేశములోని ఫిలింపరిశ్రమాభిలాషులందరు ముఖ్యముగా ఆంధ్రనాట్యకళాపరిషత్తువారునూ చేయూత నిచ్చెదరని ఆశించుచున్నాను.

ఇట్లు
ఏ. వి. సీతారామయ్య,
యం. ఏ., ఎల్. ఎల్. బి.,
146, బ్రాడ్వే, మద్రాసు.

# కల్నల్ కాలిన్ మెకంజీ

ఆంధ్రుని ఐరోపియన్ మిత్రులలో కల్నల్ కాలిన్ మెకంజి యొకడు. ఆంధ్రచారిత్రక పరిశోధకులకు మెకంజినామమును, ఆతడు సేకరించిన స్థానిక చారిత్రక సంపుటములును చిరపరిచితములు. విదేశీయుడు అయ్యు ఈ దేశమున పల్లెపల్లెకు పర్యటనముసల్పి అచటి చారిత్రక విశేషములన్నియు సేకరించి లిఖిత మొనర్చి భావిచారిత్రక పరిశోధకులకు మహోపకారముగావించిన ఆమహనీయుని జీవితకథ పఠనీయమైనది.

పఠనీయమైన దేకాని అది యెచ్చటను సమగ్రముగ లభ్యముగుటలేదు. పలుగ్రంథములందు అది శకలములు శకలములుగా దొరుకుచున్నది. 1. Men whom India has kuown (J.J. Higginbotham), 2. Orme & Mackenzie (Srinivasachariar, C.S), 3. Dictionary of Indian Biography (Buckland), 4. Biographical Sketches of Dekkan poets(Venkataramaswami, c.), 5. Madras Journal of Literature and Science Vol II, 6. Journal of the Royal Asiatic Society Vol I, 7. The Military Engineers in India (E. W. S. Sandes - Lieunt. Colonel.) అను గ్రంథముల సాయమున ఆతని జీవితకథ ఈ క్రిందివిధముగా తెలిసికొననైనది.

మెకంజి 1753-వ సంవత్సరమున జననమొందెను. ఆంగ్ల దేశమున లూవిస్ ద్వీపము అతని జన్మస్థలము. అతనితల్లిదండ్రులనుగూర్చి కాని, చదువు సంధ్యలనుగూర్చి కాని, చిన్ననాటి జీవితమునుగూర్చి కాని ఎట్టి వివరములును తెలియరావు.

1782-లో అతడు ఇండియాకువచ్చి మద్రాసు ఇంజనీరింగుశాఖలో ప్రవేశించెను. ఇట్లాతడు ఇండియాకు వచ్చుటకుపూర్వము ఆతని జీవితమున నడచిన ఒకవిషయము మాత్రము మనకు తెలియుచున్నది. 1832-వ సంవత్సరమున హౌస్ ఆఫ్ కామన్సువారు ఈస్టిండియా కంపెనీవారి వ్యవహారములనుగూర్చి సల్పిన దీర్ఘవిచారణ సమయమున సింహళద్వీపమున ఛీఫ్ జెస్టిస్ గానుండిన సర్ అలెగ్జాండర్ జాన్ స్టన్ ఇచ్చిన సాక్ష్యమునుబట్టి మెకంజి జీవితమునందలి ఈ విషయము తెలియవచ్చినది. ఈ విషయమువలననే మెకంజీకి ఓరియంటల్ రిసెర్చియందు అభిలాషయు, అభినివేశమును కలిగియుండవచ్చును.

ఆంగ్ల దేశమునందలి మెర్చిస్టన్ ప్రభుపరంపరలో ఐదవవాడు అయిన లార్డు నేపియర్ ఫ్రాన్సిస్ తన పూర్వీకుడైన జాన్ నేపియర్ జీవితచరిత్ర వ్రాయదలంచెను. జాన్ నేపియర్ ఇంగ్లీషు లోగరిథమ్సును కనుగొని ఆ గ్ల దేశపు గణితశాస్త్రజ్ఞులలో ప్రఖ్యాతుడైనవాడు. ఆగణితశాస్త్రజ్ఞుని జీవితమును వ్రాయుటలో ఫ్రాన్సిస్ హిందువుల గణితశాస్త్ర విజ్ఞానమునుగూర్చియు, అందు ముఖ్యముగా అందలి సంవర్గమాన విధానోపయోగములను గూర్చియు తెలిసికొనగోరెను. ఆసంబంధమగు విషయ విజ్ఞానమును కూడినంత ఏర్చి కూర్చుటకై ఆప్రభువు మన మెకంజీని నియమించెను. కాని ఆపని పూర్తి

కాకమునుపే ఆ ప్రభువు మరణించెను. అంతతో మెకంజి చేయుచున్నపనికి భంగపాటు కలిగెను.

చేయుచున్నపనికి భంగపాటు కలిగెనేకాని చేయుచున్నపనిపై నాతనికి ఉత్సాహము తగ్గలేదు. ఓరియంటల్ రిసెర్చియందు అతనికి అగ్గలమగు కాంక్ష కలిగెను. కాగా అతనికి హిందూదేశమునకు పోవవలయునను తహతహ పుట్టెను.

నేపియర్ ప్రభువు తోడబాటు సీఫోర్తు ప్రభువునుకూడ మెకంజి ఆశ్రయించియుండెను. సీఫోర్తుప్రభువునకు ఈస్టిండియాకంపెనీలో కొంత పలుకుబడిగలదు. ఈపలుకుబడివలన ఆప్రభువు తనఆశ్రితునకు ఈస్టిండియాకంపెనీ వారి మదరాసుశాఖలో ఇంజనీరింగుడిపార్టుమెంటులో నొక ఉద్యోగమిప్పింపగలిగెను. మనోరథమిట్లు ఈడేరగ నాతడు 1782 లో ఇండియాకువచ్చెను. వచ్చుచు నాతడు రెండు సిఫారుసు ఉత్తరములను కూడ తెచ్చుకొనెను. అందు ఒకటి అప్పటి మదరాసు గవర్నరైన లార్డుమెకార్ట్నీకి. రెండవది మధురలో నొక ఉన్నతోద్యోగమునను్న మిస్టర్ జాన్‌స్టన్‌కు.

ఈజాన్‌స్టన్ భార్య మెకంజి మొదటిపోషకుడగు లార్డునేపియర్ కుమార్తె. ఆమెవిదుషి. ఆసమయమున ఆమె తనతండ్రి తలపెట్టిన తన పూర్వికునిజీవితకథ పూర్తిచేయు విషయమున ప్రయత్నములు సాగించుచుండెను. ఇందుకొఱకుగాను ఆమె మధురయందును, అచటికి చేరువనుగల గణితశాస్త్రపండితులగు బ్రాహ్మణుల పలువురను తనవద్దయుద్యోగమునకు కుదుర్చుకొనియుండెను. అట్టిసమయమున ఆమెకు మెకంజి ఈదేశమునకువచ్చుట అధికతరమగు ఆనందమును కలిగించెను. తోడనే ఆమెయు, ఆమెభర్తయు మెకంజీకి ఆహ్వానముపంపి వెంటనేవచ్చి మధురలో తమ్ము కలిసికొనవలసినదని కోరిరి. అగుట 1783 లో నాతడు మధురవెళ్లి జాన్‌స్టన్ దంపతులను కలిసికొనెను.

అత్యంతప్రాచీనకాలమునుండియు మధుర విద్యాకేంద్రముగా పేరు మిగిలియున్నది. జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము మున్నగు హిందూవిజ్ఞానశాస్త్రములయందన్నిటియందును పారము ముట్టిన పండితులెందరో మధురయందును, అపరిసరములందును ఉండిరి. మెకంజి మధురకువచ్చుటతో నాతడు వెదుకబోయినతీగ ఆతనికాళ్ళకు తగిలినట్లయ్యెను. జాన్‌స్టన్ సతివద్ద ఉద్యోగమునకు కుదిరియున్న బ్రాహ్మణపండితులతోడను, ఇతర పండితుల తోడను మెకంజి అచిరకాలముననే మంచి పరిచయము సంపాదించుకొనెను. వారితో తఱచుగా నాతడు చేయుచువచ్చిన సంభాషణలవలన హిందూదేశచరిత్రకు వలయు అనేకరీతుల భోగట్టాలు వారివలన కూర్పవచ్చునని ఆతడు తెలిసికొనెను. ఇట్లు లోకల్ రికార్డ్సును కూర్చుతలంపు మెకంజీకి మొదటిసారి మధురలో కలిగెను. ఏపవిత్రక్షణమున ఆతలంపు ఆతని మనమున కలిగినదో అనంతరము ఆతడు బ్రతికిన ముప్పదియెనిమిది వత్సరముల నిండాఱుకాలమును స్థానిక చారిత్రక గ్రంథసంపాదనమే ఆతని మనస్సుకెక్కిన పనియయ్యెను. హిందూదేశచరిత్రకు సంబంధించిన అన్నిపత్రములను సంపాదించిన వ్యక్తి మఱియొకడు ఆశియాఖండమున కాని, ఐరోపాఖండమునకాని లేడు. ఆచారిత్రకపత్రసంపాదనమున ఆతడు సొంతధనము నెంతయో వెచ్చించెను. విలువయందుకాని, విస్తృతియందుకాని మెకంజి సంపాదించిన

చారిత్రకపత్రసముదాయముతో సమమైన మఱియొక పత్రసముదాయము లేదని ఘంటాపథముగ వ్రాయవచ్చును.

ఈపత్రసముదాయమును సమకూర్చుటలో నాతడు పొందినశ్రమ ఒకతీరైనది కాదు. 1783 మొదలు 1797 వఱకుగల పదుమూడు వత్సరములలో నాతడీ విషయమున విశేషముగ పనిచేయలేక పోయెను. ఆ సంవత్సరములలో నాతడు యుద్ధకార్యములందును, వృత్తికార్యములందును పూర్తిగ నిమగ్నుడై యుండవలసివచ్చెను. దేశమున అశాంతి ప్రబలియున్న దినములవి. దినదినమును ఎక్కడో ఒకచోట యుద్ధము లేకుండినది లేదు. పైగా ఎడపడదప కఱవు.

1783 లో నాతడు ఉద్యోగరీత్యా కోయంబత్తూరు దిండిగల్ ప్రాంతప్రదేశములందుండెను. అనంతరము ఇంజనీరింగుపనుల మీద నాతడు మదరాసు, నెల్లూరు, గుంటూరు సర్కారులయందుండవలసివచ్చెను. 1790 మొదలు 1792 వఱకు మెకంజి మైసూరునందును, దత్తమండలములందును జరిగిన యుద్ధములలో పాల్గొనెను. 1783 మొదలు 1796 వఱకుగల పదుమూడు వత్సరములదియగు మెకంజి చరిత్ర ఆతని యుద్ధశౌర్యమును ప్రదర్శించునదిగానున్నది. అగుట నొక్కింత విపులముగ వివరింపబడుచున్నది.

1783-వ సంవత్సరము మే మాసమున ఆతడు మదరాసు ఇంజనీరింగు శాఖలో ఉద్యోగిగా ప్రవేశించెను. విశ్రాంతిసమయములందెల్ల ఆతడు హిందూదేశపు అర్కియాలజీ, చరిత్ర వీనికి సంబంధించిన విజ్ఞాన సముపార్జనము గావించువాడు. 1790 లో తటస్థమైన మూడవ మైసూరుయుద్ధమున నాతడు పాల్గొనవలసివచ్చెను. 1792 వఱకును టిప్పుసుల్తానుతో ఆంగ్లేయుల కగుచుండిన మూడవ మైసూరుయుద్ధమున నాతడు పాల్గొనవలసివచ్చెను. టిప్పుసుల్తాను కోటలలో బెంగుళూరు కోట అతిబలిష్ఠమైనదిగా చెప్పబడుచుండెను. ఆంగ్లసేనాని కారన్‌వాలిస్ దానిని పట్టదలచెను. కాగా ఆతడు తనసేలతో 1891 మార్చి మాసమున బెంగుళూరుపై దండెత్తెను. అప్పుడు ఆంగ్లసేనతో ఉన్న నలుగురు ఇంజనీర్లలో మెకంజి యొకడు. మార్చి 21-వ తేదీని ఉదయమున మెకంజి కొందరు సైనికులతో కందకముదాటి కోట గోడకు నిచ్చెనలువైచికొని ఎక్కి అక్కడ మూగిన ఎదిరిసైనికులతో దొమ్మికయ్యము గావించి కోట స్వాధీనము కావించుకొనెను.

బెంగుళూరుకోట తరువాత అచట్టికి ఉత్తరమున ముప్పదిమైళ్ళ దూరమున ఉన్న నందిదుర్గము కోటను పట్టుకొనిరి. సముద్రమట్టమునకు రెండువేల అడుగుల యెత్తునఉన్న కొండపై మూడుమైళ్ళచుట్టు కొలతతో ఆదుర్గము దుర్భేద్యమైయుండెను. ఆకొండపైకి పోవలయుననిన ఒకేప్రక్కను మార్గము గలదు. మిగిలిన మూడుప్రక్కలనుండియు ఆ కొండనెక్కుటకు వీలులేదు. టిప్పుసుల్తాను తండ్రియగు హైదరాలీ ఈ దుర్గమును, స్వాధీనము చేసికొనుటకు మూడుసంవత్సరములు ఘోరయుద్ధముకావించి కాని సిద్ధసంకల్పుడు కాలేకపోయెను. తండ్రి అంతకష్టపడి జయించిన దుర్గమును ఆతని కొడుకగు టిప్పుసుల్తానునుండి ఆంగ్లసేనలు మూడువారములలో (1791 అక్టోబరు 18-వ తేదీ) స్వాధీనము చేసికొనగలిగినవి. ఈ యుద్ధమున ఆంగ్లసేనలకు మెకంజి సీనియరు ఇంజనీయరుగా నుండెను. మెకంజి ఈముట్టడిసమయమున చూపిన శక్తిసామర్థ్యములను కమాండర్ ఇన్

ఛీఫ్ హెచ్చుగా మెచ్చుకొనియున్నాడు. 1792-వ సంవత్సరమున కారన్‌వాలీసు మైసూరుపై ఎత్తివెళ్ళెను. ఆసందర్భమున శ్రీరంగపట్టణమున జరిగిన యుద్ధమునందు ఛీఫ్‌ఇంజనీరుగానుండిన పాట్రిక్ రాస్‌వద్ద మనమెకంజి ఎయిడ్‌డి కాంపుగానుండెను.

1793-లో జరిగిన పుదుచ్చేరి ముట్టడికి అధికారులు ఆతనిని పంపిరి. 1795-లో యూరప్‌నందు ఇంగ్లీషువారికిని డచ్చివారికిని యుద్ధముపొసగెను. అగుట ఇండియాయందలి ఇంగ్లీషువారు సింహళద్వీపమునందలి డచ్చివలసలపై దాడివెడలిరి. దాడికి నాయకుడు జేమ్సుస్టూఆర్టు. దాడి జూలైలో ప్రారంభమయ్యెను. ఆదాడితో వెళ్ళిన ఆర్గురు ఇంజనీర్లలో మెకంజి యొకడు. డచ్చివారి నుండి ఇంగ్లీషువారు ట్రిన్‌కోమలి లాగికొనిరి. అనంతరము కొలంబో ముట్టడించిరి. ఆయదనున మెకంజి ఛీఫ్‌ఇంజనీయరుగా నుండెను. ముట్టడిసమయమున ఒకసారి ఆంగ్లసైనికులకు వంటచెఱకు కఱవయ్యెను. ఛీఫ్‌ఇంజనీరు మెకంజి బహుభద్రముగ నుంచుకొనుచుండిన అతిసుందరములగు మేదరిబుట్టలు, వంపులు గుంపులుతీర్చి చిత్రికపట్టి తయారుచేసి జాగ్రత్తపఱచుకొనుచుండిన కట్టెల దిండ్లు అప్పుడు ఆంగ్లసైనికులకు వంటచెఱకుగా నుపయోగింపవలసివచ్చెను. వస్తుసంగ్రహణవిషయమునగల కష్టమును లెస్సగ నెఱిగిన మెకంజి ఆసమయమున మనమున ఎంతచికాకుపడెనో! 1796-వ సంవత్సరము జనవరి 15-వ తేదీని కొలంబో ఆంగ్లేయుల స్వాధీనమయ్యెను.

1797 లో జనరల్ క్రెయిగ్ యాజమాన్యమున ఆంగ్లేయులు ఫిలిప్పైన్ దీవులలోని మానిల్లాపై ఎత్తివెళ్ళిరి. ఆదండయాత్రలో మూడువందల పాయినీర్లపై మెకంజి ఛీఫ్ ఇంజనీరుగా నుండెను. ఆదాడి యనంతరము మెకంజి మదరాసుకు తిరిగి వచ్చెను.

1798 లో నాతడు ఆంగ్లసేనలు నైజాం సేవలోనున్న ఫ్రెంచిసైనికులను ఓడించు సందర్భమున హైదరాబాదులోనుండెను. 1799 లో కూడ నాతడు నైజాంసేనలతోనుండెను. అదే సంవత్సరమున పొసగిన నాలుగవ మైసూరు యుద్ధములో నాతడు పాల్గొని శ్రీరంగపట్టణమును ముట్టడించి స్వాధీనముచేసికొనుటలో చాల సాయపడెను. టిప్పుసుల్తాను రాజధానీనగరమగు శ్రీరంగపట్టణమ్మున ఆతడాసందర్భమున పెక్కు పురాతన వస్తువులను, ప్రాచీననాణ్యములను సంగ్రహించెను.

1799 లో శ్రీరంగపట్టణము స్వాధీనమగుటతో మైసూరురాష్ట్రమునంతటిని సర్వే చేయుటకు మదరాసు ప్రభుత్వమువారు మెకంజీని నియమించిరి. మైసూరు రాష్ట్రము డెబ్బదివేల చతురపుమైళ్ళ వైశాల్యముగలది దీనిని సర్వేచేయుటకు నియమింపబడుటతో మెకంజీకి అచట పురాతనవస్తుసంగ్రహమునకు, స్థానిక చారిత్రక విషయ సంగ్రహమునకు మంచి అవకాశము కలిగెను. అతడీ యుద్యోగమునకు నియమింపబడుటతో ఆతని జీవితమున నూతనాధ్యాయము ప్రారంభమైనదని చెప్పవచ్చును. మైసూరు సర్వే 1809 వఱకు సాగెను. ఆతని సర్వేయింగు పనుల సక్రమనిర్వహణమునకు ప్రభుత్వమువారు ఆనందితులై 1810-వ సంవత్సరము అక్టోబరుమాసమున నాతనిని మదరాసు రాష్ట్రపు సర్వేయరు జనరలుగా నియమించిరి.

సర్వేయరు జనరలుగా పనిచేయుటలో అతనికి ఓరియంటల్ రిసెర్చిచేయుటకు మంచి

అవకాశముగలదు. కాని ప్రభుత్వమువారు అతనిని ఆ ఉద్యోగములో చిరకాలము నిలిపి యుంచలేదు. 1811-వ సంవత్సరమున ఆంగ్లేయులకు జావాయందలి డచ్చివారితో యుద్ధము పొసగెను. అచటకు ఎత్తివెళ్ళిన ఆంగ్ల సేనలకు మెకంజి ఛీఫ్ ఇంజనీరుగానుండెను. ఆసందర్భమున అతనికి కొద్దిలో చావుతప్పెను. జూలై 14-వ తేదీని లెఫ్టినెంటు జాన్ బ్లాకిస్టన్‌తోను మరికొందరు నావికులతోను బటేవియా సముద్రతీరమునదిగి మెకంజి ఆంగ్ల సేనలు విడిదిచేయుటకు అనుకూలప్రదేశము నకై అన్వేషింప నారంభించెను. మెకంజీయు, బ్లాకిస్టన్‌ను మిలిటరీ ఇంజనీరు దుస్తులను విడనాడి నావికులదుస్తులను ధరించి మారువేషము వేసిరి. మెకంజి ఆరుఅడుగుల రెండు అంగుళముల ఎత్తరిమనిషి. అతడు తొడిగిన ట్రవుజరు, జాకట్టు మిక్కిలి పొట్టిగానుండుటచే ఆసమయమున అతని ఆకారము మిక్కిలి వికృతముగానుండెను. దారిచూపుటకుగాను కూడ ఒక చీనా దేశీయుడు; తోడుగా మరినలుగురు నావికులు- వారు చెంతనే యున్న ఒకగ్రామమునకు వెళ్ళిరి. ఆగ్రామమున అంతకుపూర్వమే ఫ్రెంచిసైనికులు విడిదిదిగియుండిరి. వారు ఈవచ్చిన వింతవారిలో ఆంగ్లేయులుండుట గుర్తించిరి. మెకంజియు, అతనితోకూడవచ్చినవారును వెంటనే పలాయనము చిత్తగించిరి. ఫ్రెంచిసైనికులు వారిపై తుపాకులు గురిపెట్టి కాల్చుచు వెన్నంటిరి. ఇంతలో మెకంజియు అతని స్నేహితులును తమనావలవద్దకుచేరి మిగిలిన వారికి సంగతితెలిపి నావలకు లంగర్లుఎత్తి సముద్రమున చొచ్చిరి. ఇంతసేపును ఫ్రెంచి సైనికులు వెన్నంటివచ్చుచు తుపాకులు పేల్చుచుండిరి. హిందూదేశ భావిచారిత్రక పరిశోధకుల అదృష్టవశమున ఆయదనున మెకంజి మరణదేవత కరాళవదనమున చిక్కలేదు.

ఆయుద్ధమున ఆంగ్లేయులు జావాను పట్టుకొనిరి. 1815-వ సంవత్సరము మార్చి మాసమువరకును మెకంజీ జావాయందే యుండెను. ఆనాలుగు సంవత్సరములును జావాకు సంబంధించిన భూగోళవిషయములు, పాడిపంటలు, పూర్వపు డచ్చిప్రభుత్వపు విధానము, మిలిటరీరిపోర్టు్స, పురాతత్త్వవిషయములు, చారిత్రకవిషయములు సేకరించుచుండెను. ఇంతకుమున్ను తనకు శత్రువులుగానుండిన బటేవియావారితోకూడ అతనికిప్పుడు మంచి స్నేహము కుదిరెను. బటేవియన్ సొసైటీవారు ప్రచురించుచుండిన జర్నలుకు అతడు వ్యాసములు వ్రాయుచుండువాడు.

1815 లో అతడు ఇండియాకు తిరిగి వచ్చెను. కంపానియన్ ఆఫ్‌ది బాత్ గౌరవము అతని కొసంగబడెను. ముప్పదిసంవత్సరములు మదరాసు రాజధానిలో పనిచేసిన యనంతరము 1816 లో అతడు ఇండియాదేశపు సర్వేయరు జనరలుగా నియమింపబడెను.

ఈక్రొత్త ఉద్యోగము వచ్చుటతో అతడు దక్షిణ హిందూదేశమును వీడవలసివచ్చెను. హిందూదేశపు సర్వేయరు జనరలుగా అతని మకాము కలకత్తా పట్టణమున. తాను కూర్చిన పురాతనవస్తువులతో, సారస్వతగ్రంథములతో అతడు కలకత్తాకు ప్రయాణమయ్యెను. తాను సమకూర్చిన రికార్డ్సునుపర్చి అరేంజిచేయుటకును, భాషాంతరీకరించుటకును, ఇంకనువలయు సర్దుబాటులు చేయుటకును అతడు తనకడ పలువురు బ్రాహ్మణపండితులను పనికి కుదుర్చుకొని యుం

డెను. ఆపండితులకును, మెకంజీకిని ప్రాణమైత్రి ప్రబలినది. మెకంజి కలకత్తాకుపోవుచుండగా ఆపండితులు అతనినివదలలేక తామును కలకత్తాకుపోవుటకు కృతనిశ్చయులైరి. తనవద్దనున్న వస్తువులకును, గ్రంథములకును పూర్తియగు కేటలాగు తయారుచేయవలయుననియు, కూడినంతవఱకు తాను ఏర్చి కూర్చిన విషయములను ప్రచురించవలయుననియు ఆతడు సంకల్పించుకొనెను. ఆతనితో వెళ్లిన పలువురు పండితులకు కలకత్తాలో ఆరోగ్యము చెడినది, కొందరు మరణించిరి. అగుట మెకంజి సంకల్పము కార్యరూపమును తాల్చలేదు.

అందుతో మెకంజికి ధైర్యము చిటిలెను. ఉద్యోగముననుండి వృత్తికార్యములు నిర్వహించుచు తానిక ఈపనిని చేయజాలనని ఆతనికి తోచెను. కాగా అతడు 1817-వ సంవత్సరమున తనమిత్రుడగు సర్ అలెగ్జాండరు జాన్‌స్టన్‌కు లండను ఉత్తరము వ్రాసెను. ఈస్టిండియాకంపెనీవారి కోర్టుఆఫ్ డైరెక్టర్సుతో చెప్పి తనకు మూడుసంవత్సరముల కాలము జీతము నష్టములేనిశలవు ఇప్పించమనియు, అట్లు ఇప్పించినచో తాను ఇంగ్లండుకు తిరిగివచ్చి అచ్చటి ప్రాచ్యభాషాపండితుల సాహాయ్యమున తనవద్దనున్న చారిత్రక పత్ర సముదాయమును క్రమస్థితికి తెచ్చి ప్రచురింతుననియు ఆఉత్తరమున మెకంజి జాన్‌స్టన్‌ను కోరియుండెను.

కాని కోర్టు ఆఫ్ డైరెక్టర్సువారు ఈ సూచనకు అంగీకరింపలేదు. అందుతో మెకంజీకి తీరని నిరుత్సాహము కలిగెను. వృత్తి సంబంధమగు పనులతోడను, ఓరియంటల్ రిసెర్చితోడను అతనికి పని తలమునకలుగా నుండెను. ఈ అమితశ్రమ అతని ఆయుర్దాయమును కబళించివైచెను. 1821-వ సంవత్సరము మేమాసమున 8-వ తేదీని కలకత్తా చెంత అతను అసువులనుబాసెను. హిందూదేశమున ఆర్కియాలజీ పరిశోధకులలో తొలి జట్టుకుచెందిన మెకంజి ఇట్లు తన సంకల్పమును నెరవేర్చుకొనకయే పరమపదించెను. చనిపోవుసరికి అతనికి అరువదియెనిమిది సంవత్సరములు.

కృష్ణానదికి దక్షిణమునగల పురాతత్త్వ విషయమున చూడదగిన ప్రతిప్రదేశమును ఆతడు తొక్కిచూసినాడు. ప్రాక్తనశిథిలముల చిత్రములను రెండువేలకుపైగా తయారుచేసినాడు. నూటికి పైబడిన శాసనముల ప్రతిబింబములను తీసినాడు. మఱియొక ఎనిమిదివేల శాసనములకు నకళ్లువ్రాసినాడు. స్థానిక చారిత్రకసంపుటములను డెబ్బదియేడింటిని కూర్చినాడు. మైసూరు చరిత్రరచనమున మార్కువిల్క్సుకు మిక్కిలి తోడుపడినాడు. మెకంజి సంగ్రహించిన వస్తువులకు, గ్రంథములకు విలియమ్ టెయిలర్ అనునతడు కేటలాగు తయారుచేసినాడు. ఆ కేటలాగే ఐదువందల డెబ్బదిపుటల ఉద్గ్రంథమైనది.

రిసెర్చి విషయమున మెకంజి తన సొంత ద్రవ్యమును విస్తరించి వెచ్చించెను. గవర్నమెంటు అతని ఖర్చులను, అతని పండితుల జీతపుఖర్చులును మాత్రము భరించునది. ఏమైన వస్తువులుకాని, పుస్తకములుగాని కొనవలసివచ్చుచో ఆఖర్చు మెకంజీదే. అతడీరూపముగ చనిపోవుసరికి 15,000 పౌనులను వెచ్చించెను. ఇంతటివ్యయముతో ఆతడు కూర్చినవస్తువులను, పుస్తకములను అతని అనంతరము అతని భార్యవద్ద ప్రభుత్వమువారు 10,000 పౌనులకు కొనిరి.

# నిమిషానికి వెయ్యిసిగరెట్లు

నేటి సిగరెట్టువర్తకులలో బెరన్‌హార్డు బారన్ చక్రవర్తి. అతనినామము ఆంధ్ర భూమిపాఠకులకు క్రొత్తదికాదు. 1936 డిశంబరు సంచికయందలి 'కోటీశ్వరులైన కూటిపేదలు' అనువ్యాసమున బెరన్‌హార్డు బారన్‌నుగూర్చియు, ఆతడుచేసిన సిగరెట్ల వ్యాపారమునుగూర్చియు కొంతవ్రాయబడి యున్నది. ప్రస్తుతవ్యాసమున అదేవిషయము ప్రస్తరించి వ్రాయబడుచున్నది.

ప్రపంచచరిత్రలో ఆధునికయుగము వర్తకులయుగము. అట్టి వర్తకులయుగమున పొడసూపిన వణిక్పుంగవులలో బెరన్‌హార్డు బారన్ యొకడు. వ్యాపారనిర్మాణవిషయమున అతడు సాటిలేనివాడు. చేరలకొలది విత్తమార్జించినాడు. అర్జించుటయందేకాదు, దానముచేయుటయందును అతడు అసదృశుడే. దానములక్రింద అతడు అతని జీవితకాలమున 20,00,000 పౌనులను వెచ్చించినాడు. మరణకాలమున మరియొక 20 లక్షల పౌనులను దానము చేసినాడు.

ఇంతటి విశేషధనమును దానముచేయుటకు అతనికి అవకాశముకల్పించిన వ్యాపారసంస్థనామము కార్రిరాన్ లిమిటెడ్ అని. ఆకంపెనీ చాలకాలమునాటిది. అది స్థాపింపబడినది 1788 లో. జోన్ జోక్వెన్ కార్రిరాన్ అను పేరుగల స్పానిష్ దేశీయుడొకడు లండన్‌నందలి రీజెంటు స్ట్రీటు‌నందు ఒక పొగాకు దుకాణమును పెట్టెను. అప్పుడు మూడవజార్జి చక్రవర్తి పరిపాలించుచుండెను.

స్థాపించిన కొద్దికాలమునకే కార్రిరాన్ దుకాణము మంచిపేరు సంపాదించి దినదినమును పెక్కుమంది ఖాతాదారులను ఆకర్షించుచువచ్చెను. పొగగొట్టములో వైచుకొని పొగపీల్చుటకైన పొగాకుపొడిని 1867-వ సంవత్సరమునుండియు ఆకంపెనీవారు అమ్ముటకు ప్రారంభించిరి. ఆపొగాకుపొడిని ఇతరవస్తువులతో కలిపి కమ్మగ తయారుచేసినది ఎరల్ ఆఫ్ క్రేవెన్. ఆపొడి ఇప్పటికిని అతనిపేరనే అమ్మబడుచున్నది.

1903-వ సంవత్సరమున ఈవ్యాపారము బెరన్‌హార్డుబారన్ చేతులలోకి వచ్చెను. నాడు మొదలు అది కొద్దిసంవత్సరములలో బెరన్‌హార్డు బారన్ ప్రతిభవలన అతివిస్తృతి నందెను. సిగరెట్లుతయారుచేయు యంత్రములను లోపరహితమైన సమగ్రస్థితికి తెచ్చిన బుద్ధిమదగ్రేసరుడు బెరన్‌హార్డుబారన్నే. నేడు ఆతడు తయారుచేయు సిగరెట్లు ప్రపంచమునందలి మారుమూల ప్రదేశములందుకూడ అమ్మబడుచున్నవి.

అయితే ఆవణిక్పుంగవుడు చేసినపనులలో కెల్ల బ్రహ్మాండమైనపని నవీనపద్ధతులలో లండనుమహానగరమున ఒక సిగరెట్లఫ్యాక్టరీని స్థాపించుట. ఆఫ్యాక్టరీ లండన్ మహానగరపు ఉత్తరభాగమున నున్నది. భావికాలపు ప్రపంచవ్యాపారవిస్తృతిని అంచనావేయుటకు అదియొక కొలకర్రగా విరాజిల్లుచున్నది. పారిశ్రామికముగ విశేషాభివృద్ధినందియున్న యూరప్‌ఖండములోని, అమెరికా ఖండములోని మాన్యుఫాక్చరర్లు అందరును చూడదగిన, చూడవలసిన యంత్రాగారము అది.

ఆఫ్యాక్టరీ దేవాలయమువలె కట్టబడినది. గృహము మాదిరి నిర్వహింపబడుచున్నది. టంకసాలవలె డబ్బును ఉత్పత్తిచేయుచున్నది. ఆఫ్యాక్టరీ వృత్తాంతమంతయు ఒక స్వప్నగత

వృత్తాంతమువలెనుండును. స్వప్నమే. కాని ఇందలి ధనము చేతికిఅందును. నూటికి ఏబది పాళ్లు లాభమును పంచుచున్నది. ఇంతకును అదిఇచ్చులాభముపై ఎట్టిపన్నుగాని లేదు.

ఆఫ్యాక్టరీమందిరము బ్రహ్మాండమైనది. అది నిర్మించుటకు పదిలక్షల పౌనులు వ్యయమైనవి. లండనుమహానగరములోని ఒకచతురపు ప్రదేశమంతయు అది ఆవరించుకొన్నది. కాని దానికి పట్టియున్న సుగుణములలో విశాలరమ్యత ఒక్కటియే కాదు. ఇతర సుగుణములముందు విశాలరమ్యత అను సుగుణము అంతగా పరిగణింపరానిదని చెప్పక తీరదు.

ఆయంత్రాగారమున పెక్కుబ్రాండుల సిగరెట్లు తయారుచేయబడుచున్నవి. అందు నల్లపిల్లిమార్కు సిగరెట్లు ౭ కరకము ఆ ఫ్యాక్టరీ సింహద్వారమున ఇరుపక్షములందును చెరియొక నల్లపిల్లి విగ్రహమును ఉంచబడియున్నవి.

ఆయంత్రాగారము బయటను, లోపలను నలుపు, ఎరుపు, ఆకుపచ్చ చారలతో అలంకరింపబడియున్నది. మందిరమునకు ఎదుట పండ్రెంటు పెద్ద స్తంభములుగలవు. రాత్రిపూట ఆభాగమంతయు మిక్కిలి కాంతిగల విద్యుద్దీపములతో శోభాయమానమగుచుండును. లక్షలకొలది పున్నమచంద్రులు అచట ప్రకాశించుచున్నట్లుండును. ఆదీపముల ముందు వీధిలోని కార్పొరేషన్ దీపములు దివిటీముందు దీపములవలె వెలవెలబోవుచుండును.

గ్రేట్ బ్రిటన్ నందు రీయిన్‌ఫోర్స్డు కాంక్రీటుతో కట్టబడిన కట్టడములన్నిటికంటెను బారన్ సిగరెట్లఫ్యాక్టరీ పెద్దది. ఆమందిరమున ఆరుఅంతస్థులు, అరువదియైదులక్షల క్యూబిక్ అడుగుల ఆవరణ–

మందిరములోపల ఎనుబది బ్రహ్మాండమైన యంత్రములుగలవు. అవి నిముసమునకు వేయినంతున సిగరెట్లు చేయుచుండును. మూడువేలమంది కార్మికులు. అందు పెక్కురు సుందరవదనములతో ఒప్పారు కన్యలు. సాధ్యమైనంత సులభముగను, కూడినంత ఆనందకరముగను చేయబడిన అచటి పనిని ఆ మూడువేలమంది నిర్వహించు చుందురు.

ఇక ఆకంపెనీడైరెక్టర్లు సమావేశమగు మందిరభాగము అతిసుందరమైనది. అది దేవతలకుకూడ చూడదగినస్థలము. అంతటి సుందరమందిరము భాగ్యవంతమైన బ్రిటిష్‌దీవులయందే మరియొకటి లేదు. నలుపు, ఎరుపు, ఆకుపచ్చరంగులతో అలంకృతమై అది యొక ఉన్మీలిత చిత్రమువలెనుండును. అందు కొమ్మలుగల దీపస్తంభములు ఆరున్నవి. ఇవిగాక అందలిగోడలమందు అలంకారదీపములు పెక్కు పైకి పొల్తిపట్టరానంత నైపుణ్యముతో పొదుగబడియున్నవి. మరి ఆమందిరపునేల అద్దముకంటె నునుపుగానుండు పాలగచ్చుతో చేయబడినది.

ఆఫ్యాక్టరీయందు అంతయు క్రొత్తపద్ధతి. సాధ్యమైనంతవరకు ప్రతిపనియు యంత్రములే చేయుచుండును. సిగరెట్లతో నిండియుండు ట్రేలను మోసికొనిపోవు యంత్రములుకొన్ని, పార్సెల్సును కట్టు యంత్రములుకొన్ని, పొగాకును తుంబితుంబాలక్రింద త్రుంచివేయు యంత్రములుకొన్ని, కాగితపుచుట్టను అతకుయంత్రములుకొన్ని, డబ్బాలకు రేపరు అతికించు యంత్రములుకొన్ని—ఈ యంత్రములను అన్నిటిని మించినవి సిగరెట్లను తయారుచేయు యంత్రములు. తయారుచేసిన సిగరెట్లను ఆయంత్రములు వాయువేగమున వెలికిత్రోయుచుండును. యంత్రమునుండి బయటికిపడుచుండగా వానిని లెక్కించుట చూచినమాత్రమున తాండ్రచెట్టునగల ఆకులను ఫలములను నలునకు సరిగ చెప్పిన ఋతుపర్ణుని

వంటి అక్షుహృదయము నెఱిగిన సంఖ్యావిదునకు సయితము దుస్తరమగును.

ఆయంత్రాగారమున పని ప్రవాహవేగమైన నదిలోని జలమువలె సాగుచుండును. రెండే ద్వారములు. లోనికివచ్చు సరకుల కొకటి, బయటికిపోవు సరకులకు మరియొకటి. ఎట్టిచిందఱకాని ఎట్టివందఱకాని ఉండదు. అన్నియు అన్ని కాలములందును యథాప్రదేశవినివేశితములై యుండును.

టెక్నిక్ క్రొత్తదై యున్నట్లే అచటి ఆరోగ్యవిధానముకూడ క్రొత్తదై యున్నది. దుమ్ము అన్నది ఆయంత్రాగారమున కలికములోనికైన దొరకదు. ఎప్పటికప్పుడు దుమ్మును డస్టుఎక్స్ట్రాక్టర్లు అను యంత్రములు వెలికి గొనిపోవుచుండును.

ఇక నచట వాయుదేవుడు ఆయంత్రాగారపు యజమాని ఇచ్చవచ్చిన మచ్చున సంచరింపవలసినదే. అచట అపుడు ఎట్టి శీతోష్ణస్థితి కావలసియున్నదో అట్టిశీతోష్ణస్థితిని అచటియంత్రములు నిరంతరము కలిగించుచుండును. ప్రధానమగు వస్తువగు పొగాకుకు కావలసిన క్లైమేటుకూడ ఆయంత్రాగారముననే ఉత్పత్తియగును.

ఇట్లు శీతోష్ణస్థితిని కోరినపరిస్థితులలో నిలిపియుంచు యంత్రములు ఈఫ్యాక్టరీలో ఉన్నన్ని యూరప్‌లోని మరియేఫ్యాక్టరీయందును లేవు. అరువదివేల పౌనులు వెచ్చించి ఆయంత్రములు నిర్మింపబడినవి. లోనికి వచ్చు గాలిఅంతయు క్షాళితమొనర్చబడును. పిదప వేడిచేయబడును. పిమ్మట చెమ్మగిలునట్లు చేయబడును. శీతకాలమగుగాక వేసవియగుగాక లోనగాలి ఒకేమోస్తరుగ నుండును. నడి శీతకాలమగు జనవరిమాసమున సయితము ఆఫ్యాక్టరీయందలి పనికత్తెలు చేతులకు ఎట్టి దుస్తులును ధరింపకయే పనిచేయుచుందురు.

అచటివాయువు స్వచ్ఛమైనది, శుచియైనది. పల్లెపట్టులందు దివ్యభవనములలో నివశించు భూస్వాములకు సయితము అందుబాటునుండుటకు అసంభవమైన గాలి ఆఫ్యాక్టరీయందు పనిచేయుచుండు మూడువేలమంది కార్మికులును అనుభవించుచుందురు.

నొప్పికలుగకుండ ధనమును ఆర్జించుపద్ధతి కేర్రాసుఫరమువారికి తెలియును. 1928-వ సంవత్సరమున 12,58,847 పౌనుల లాభమును ఆకంపెనీవారు గడించిరి. ఆలాభమంతయు ఒకనికిమాత్రమే చెందదు. అచట పనిచేయు ప్రతివానికిని అందు భాగముగలదు.

పలుకంపెనీలకు మేధమాత్రమేయుండును. హృదయము ఉండదు. కాని కేర్రాసుకంపెనికి మేధ,హృదయము రెండునుఉన్నవి. పనివారలక్షేమ మరయుటకు అచ్చట డాక్టర్లు, దంతవైద్యులు, నర్సులు ఉన్నారు. వ్యాధికుదిరి స్వస్థపడు సమయమునకు వలయు విశ్రాంతి, వినోదము కలిగించుటకు వలయు సౌకర్యములు ఏర్పాటుచేయబడియున్నవి. ఆటలాడుకొనుటకు స్థలములు– రోగసమయమున జీతములిచ్చుటకు పనినుండివిరమించుచో ఉపకారవేతనములిచ్చుటకు ఏర్పాటులు గలవు.

క్రిస్టమస్ పండుగకాలమున ప్రతిపనివానికిని ఒకవారముదినముల కూలి అదనముగ ఈయబడును. అపుడు ఒక పెద్ద సభ జరుగును. బారన్ బ్రతికియున్నంతకాలమును ఆసభకు ప్రతివత్సరమును అతడే అధ్యక్షుడుగా ఉండువాడు. అధ్యక్షతవహించి ఆయేటి వ్యాపారచరిత్రయంతయు చాటుమాటులేకుండ పనివారలకు ఉపన్యసించువాడు.

పన్ను లేకుండ నూటికి ఏబదిపాళ్లులాభమును పంచిపెట్టునట్లు వ్యాపారమును నడపదలచిన ప్రతివాడును అవలంబింపదగుసరియైన విధానమిదియే.

# బలి

రచయిత:

గూడా కృష్ణమూర్తి

బోధిసత్త్వుడు ఒకానొక జన్మమందు చక్రవర్తులకుటుంబమునందు జన్మించి వంశానుక్రమణికచేతనూ, యోగ్యతచేతను చక్రవర్తియయ్యెను. ఈతని పరిపాలనమందు రాజ్యమంతయు బహుశాంతముగ నుండెను. సామంతరాజులుగాని విదేశరాజులుగాని ఎదురుతిరుగక, ఎత్తిరాక లొంగియుండిరి. కాన ఏకచ్ఛత్రాధిపత్యముతో, ఆపదలుగాని ప్రజాపీడగాని రాజ్యమందల్లరుగాని లేకుండా రాజ్యమేలుచుండెను. విదేశచక్రవర్తులెల్లరు ఎక్కువమైత్రిగానుండిరి. ఈతనికీర్తి దిగంతముల వ్యాపించెను. నిష్కామకర్ముడై, యరిషడ్వర్గములను, తాపత్రయములను, ద్వంద్వములను, బహిఃప్రపంచ శత్రువులను ప్రేమచేత నిగ్రహించి, ప్రజాహిత సౌకర్యమే నిజసుఖముగ భావించెను. 'యథారాజా తథాప్రజా' యను లోకోక్తి ననుసరించి రాజెట్లాచరించిన ప్రజలట్లాచరింతురను మానవప్రకృతి నెఱింగి ధర్మమేజయమను పరమావధిగల్గి రాజయోగియని ప్రసిద్ధిగాంచెను. అందువలన ప్రజలకు మోక్షమార్గము లభించుటకొఱకై తాను సక్రమముగ మతవిషయమున నియోగింపబడిన ధర్మములాచరించుచు, మోక్షసాధనకార్యములన్నియు ననుసరించుచుండెను. బీదలకు ధర్మము చేయుట, నైతికశీలమునకు ఆదర్శనీయుడగుట, ఓరిమితో జీవరాసుల నాదరించుట, ధర్మకార్యదీక్ష, హృదయమునప్రేమ, శాంతము, ప్రజాసేవ జూచినచో ఆతనినిమూర్తీభవించిన ధర్మదేవతయనక తప్పదు.

ఇంతజాగరూకతతో ప్రవర్తించుచు రాజ్యమును రక్షించుచున్నను ప్రజాదుష్కృతిచేతనో, అవినీతివలననో, వరుణుని పరాకుచేతనో తనరాజ్యమందు కొన్ని పరగణాలలో అనావృష్టిదోషము సంభవించి యపరిమితమగు ప్రజాపీడగలిగెను. చక్రవర్తి, తానెంత జాగ్రదావస్థకల్గియుండినను, తన యపకృతివలననో, నిజముగా ప్రజానీతి భంగమగుటవలననో నిట్టి యనావృష్టిదోషముకల్గి పంటలులేక ప్రజలకు పీడ, క్షామము సంభవించినది అని హృదయావేదనకల్గి, మతగురువులను, పండితులను, పురోహితులను, మంత్రులను, విద్యాప్రౌఢులగు బ్రాహ్మణోత్తములను, స్వాధ్యాయవేత్తలను రావించి వారితో త్వరలో దేశక్షామనివారణకును, వరుణదేవుడు ప్రసన్నమగునటులను నేదైన నొక్కతరుణోపాయము యోజించి దెల్పవలెనని చెప్పెను. వారు వేదశాస్త్రములనుపరిశీలించి వేదోక్తమగు నొక భీకరక్రతువును చేయవలసియున్నదని తెల్పిరి. ఆ మహాక్రతువున యనేకజీవులు బలియైనగాని యనావృష్టి దోషము తొలగదని ఏకగ్రీవముగ ఘోషించిరి.

ధర్మస్వరూపుడగు చక్రవర్తికి వేదోక్తమగు మహాక్రతువిధానము వినినతోడనే, యపరిమిత పారావారపరితాపము జనియించి, దయాళులగు చక్రవర్తులు లోకమున కిచ్చు కానుక యిదియా! యని ఖిన్నుడై మూర్తీభవించిన ధర్మమూర్తి గనుక తనసంతాపమునంతయు దిగమ్రింగి మానసమున యాక్రతువున కియ్యకొనక పైకి మంత్రి, సామంత, బ్రాహ్మణోత్తముల యుపదేశము నిరాకరించినట్లు గానరాక మరియొక రాజకీయ విషయముపై సంభాషణ మరల్పజొచ్చెను.

వారీతని హృదయావేదన గానజాలక మతవిషయమై నీతనితో చర్చించుటకిదే యదనని భావించి, క్రతువుయొక్క ప్రాముఖ్యతను, రాజధర్మము బ్రాహ్మణధర్మముయొక్క పద్ధతులను వేదప్రాశస్త్యమును

గూర్చి చక్రవర్తి ఏసంభావణలోనున్నను నివియే ప్రశంసింపసాగిరి. "దేవరవారు సమస్తరాజకీయ విషయములందును, ప్రజాక్షేమముకొరకై యొనర్చెడి సేవయు, ధర్మదీక్ష, దాక్షిణ్యము నిరుపమానములు. ధర్మార్థకామమోక్షములు, అపరిమితమైన పుణ్యముతో నిర్వర్తించి ప్రజాసంరక్షణజేయు మహాప్రభో! మానవలోకమునకును దేవలోకమునకును వారధివలె సంబంధించియున్న క్రతువును నెరవేర్చుట ధర్మమే. మీయాజ్ఞయే ధర్మమని యెంచు సామంతులెల్లరును, మీరేది నియమించిన అది నిర్వర్తించుటకు సిద్ధముగానుందురు. ఈక్రతువును చేసి, ప్రజలను రక్షింపగల్గిన ధర్మమూర్తివీవే. మీయొక్క ధర్మదీక్షకు, సత్యపరిపాలనకు నిదర్శనముగ, నీక్రతువాచరించినచో దేవలోకము తప్పక ప్రసన్నమగును. దేశమందుగల క్షామబాధ తొలగిపోవును. మీకీర్తి దేదీప్యమానముగ కోటిభాస్కరతేజముతో యసమానముగ నుభయలోకముల వ్యాపించును. మీరు పవిత్రులగుటచే నిట్టి కార్యదీక్షగొనుటకు తగిన శీలము, యుదారబుద్ధి, సత్ప్రవర్తనము, ధర్మము యన్యులకు దుర్గ్రాహ్యము. కాన యీక్రతువును యాచరించిన దేవఋణవిముక్తులుకాగలరని వేదములు ఘోషించుచున్నవి. దేవతలు సంతసిల్లి నిర్దోషమగు క్రతువును యాచరించిన అనావృష్టితొలగి సుభిక్షముగానుండును. ప్రజాసౌకర్యమునకై కంకణబద్ధులైన మహారాజా! మా ప్రార్థన మాలకించి యీక్రతువు నాచరించి యాచంద్రతారార్కమగు యశస్సును బడయ వేడుకొనుచుంటిమి."

ఇంతదనుక మూర్ఖతవహించి వేడుకొనుచున్న బ్రాహ్మణోత్తములయందు విశ్వాసముంచి వేదప్రమాణము నిరసించకుండ వారివల్లనే ధర్మసంరక్షణకు భంగమురాకుండ నుండునటుల ప్రవర్తించవలయునని రాజుయోజించసాగెను. ప్రపంచమున ఎవరైన ఒక విషయమున యధికులని విశ్వాసముంచి వారిశరణుజొచ్చితిమేని వారే ధర్మశాస్త్రానుసారముగా కుతర్కములవలన లోకమునకు హానిచేకూర్చుటకలదు. అట్టి కుమార్గములను, కుతర్కములను వివేకములేక యనుసరించుచో పాపమార్గ మాచరించి సత్యమార్గ మదియే యని భ్రమచెందగలరు. నిజముగా యోజించినచో ధర్మమునకును, జీవహింసకును ఏమైన సంబంధమున్నదా? దేవలోకవాసులగు పుణ్యమూర్తులు శాంతించి ప్రసన్నులగుటకును, పాపకార్యమగు జీవహింసకును ఎంతవరకు సంబంధమున్నది? వేదమంత్రోచ్చారణవలన యజ్ఞపశువునకు ఆవేదమంత్రములే బాణములవలె తగిలి ఆపశువు మరణించి స్వర్గమున ప్రవేశించుననియు, అటుల స్వర్గారోహణచేసినందువలన సమస్తమగుఇహసౌఖ్యములు చేకూరువని తెల్పుచుండిరి. ఇందు వేదప్రామాణ్యము జూపుచు కుతర్కమువలన అది న్యాయసమ్మతమని ధర్మమని వాదించుచున్నారు. కాని యియ్యది సంపూర్ణముగ నిందార్హము, సత్యదూరము, అధర్మము, యనృతము. లోకాంతరమందు యితరులు చేసిన కర్మఫలితము, కర్మానుభవమును పొందిన జీవికెట్లు చెందును? యజ్ఞపశువును మానవులు హింసించినచో, ఎవరాహింస చేయించిరో, ఎవరుచేసిరో వారు ఆచేసిన పాపపుణ్యకర్మలననుభవింతురుగాని యజ్ఞపశువు సంచితపూర్వకర్మనంతయు త్రుంచికొని స్వర్గార్హమెట్లగును? యజ్ఞమందు బలికొఱకు తేబడినప్రాణి, యనేకక్రూరకర్మలు చేయుచు, హింసామార్గమునయుండి, ఎన్నడును సత్ప్రవర్తనకుగాని ధర్మమార్గమునకుగాని నోచుకొనకపోయినను, యజ్ఞమునందు బలియీయబడినంతమాత్రమున నిజదుష్కర్మయంతయు మాసిపోయి పుణ్యాత్ములు పతితులు నివసించు పుణ్యలోకముల కెట్లర్హమైనది? నిజముగా యజ్ఞమందు సమర్పింపబడిన ప్రాణియే స్వర్గమలంకరించుట సత్యమేయగుచో పవిత్రమగు వేదప్రమాణములుగలిగి ప్రస్తుతము యనేకవేల జీవులను బలియియ్యవలెనన్న వారలెవరైన, ఆస్వర్గలోకమున పొందుటకు యీయజ్ఞమందు నరబలిని నియమించి, ఏ బ్రాహ్మణోత్తముడైన తానే యజ్ఞపశువుగానుండుట కెందుల కియ్యకొనరాదు? ఏస్వర్గసౌఖ్యముకొరకు యప్సరాంగనల

పొందుకొరకు కాంక్షించి యజ్ఞము సల్పుచున్నారో, అట్టివారలు సుఖముగను, సులభముగను స్వర్గ ద్వారమున పొందగలరుగదా? కాన యోజించిన యీజీవహింస హేయము. ఇంత పాపకార్యమును యెంత యుత్తమ బ్రాహ్మణుడు చెప్పినను, యివివేకినై ఎట్లు శిరసావహించగల్గుదును. ఇదే ధర్మ మార్గమా? అదీగాక దేవతలందరూ చక్కని సుగంధముతో పరిమళించుచూ, రసవంతమై కష్టపడి సంపాదింపబడి యప్సరోజనములు యానందముతో పంచి పెట్టుచుండు, "యమృతము"ను వదిలివేసి, కనికరింపదగిన జీవుని, హేయమై, నికృష్టమగు పశువును యజ్ఞమందు కఠినముగ, బలవన్మరణము చెందిన శరీరమందలి 'వప'ను యితరావయవములను యాశించుదురనుట పరమేశ్వరునికి కళంకమేర్పరుచుటయే యని లోలోన తర్కించుకొని జీవహింసలేని మార్గమునకై వెదుకజొచ్చెను.

అటుల తలపోసి బ్రాహ్మణోత్తముల కియ్యకొనట్లు కానుపించినచో వారు నొచ్చుకొందురని, వారు బోధించు క్రతు విషయమంతయు శ్రద్ధగా వినుచు ఇట్లు జవాబిచ్చెను.

"బ్రాహ్మణోత్తములారా! నాశక్తి సామర్థ్యములు యతిశయోక్తిగ వర్ణించినందులకు, మీ యాశీర్వాదమునకు కృతజ్ఞుడను. మీరు యేర్పరచిన క్రతు విధానమునకు యొప్పుకొంటిని. మీయాశీర్వాదము ఫలించుగాక! యీక్రతువును "పురుషమేధ"మని పిలవవలెను. అందు ఒక వెయ్యిమంది మనుష్యులు యజ్ఞమునందాహుతియగుట యవసరము. కాన సభ చాలించి క్రతువునకు వలయు సంబారముల నన్నిటిని చేకూర్చి సిద్ధపరుపగోరెదము. మంచి సుముహూర్తముంచి యనేకదినములు జరుగు యజ్ఞముగనుక తగిన స్థలము నిర్దేశించి యజ్ఞశాలను నిర్మింపగోరెదననెను.

అందు నొక పురోహితుడులేచి 'మహాప్రభూ! యజ్ఞదీక్షానంతరము తక్షణమే దేవరవారు అవభృతస్నానమాచరించవలెను. అనంతరము క్రమక్రమముగా నొకరినొకరినే బలియీయవచ్చును. ఏలనన వెయ్యిమంది ప్రజలను ఒక్కసారి బలియిచ్చినచో ప్రజలు మిమ్ములను, మమ్ములను నిందింతురు. దేశమందు తిరుగుబాటు, విప్లవము చెలరేగవచ్చున'ని యెలుగెత్తి చెప్పెను. మిగిలిన బ్రాహ్మణులందరు యీతని యుపాయము బాగున్నదని విన్నవింపదొడగిరి. అంత చక్రవర్తిలేచి, బ్రాహ్మణోత్తములారా! ప్రజల తిరుగుబాటునకును, విప్లవమునకును మీరు యలజడిపడి జడియవలదు. అటు ప్రజాశాంతికి భంగకరములగు కార్యములు జరుగకుండ తగినప్రయత్నములుచేసి సంరక్షించు బాధ్యత నాది"యని సభముగించెను.

తదనంతరము చక్రవర్తి తన రాజ్యమందంతటనుగలప్రజలనురావించి ఒక గొప్ప మహాజనసభయందు "మహాజనులారా! నేను పురుషమేధమను మహాక్రతువును ప్రజాక్షేమమునకై తలపెట్టితిని. అందు వేయిమంది మనుష్యులను బలియీయవలెను. ఎవరు ధర్మ ప్రవర్తనగలిగి న్యాయముగ సంచరించెదరో, వారు ఆబలికి పనికిరారు. ఎవరు నైతికమార్గమునుండి మరలి, కుమార్గముల ప్రవర్తించెదరో, నా యీయాజ్ఞను యుల్లంఘించెదరో, వారు దేశద్రోహులనియు ప్రజాశత్రువులనియు నెంచబడి యజ్ఞపశువుగా పట్టుకొనబడుదురు. ఇందుకువలయు చారులను నియమించియు, నేను స్వయముగానూ సమస్తమును తెలిసికొందును. కాన జాగరూకతతో ధర్మమార్గమును గుర్తెరింగి మెలగవలెనని" తెల్పెను.

అంతట ఆ మహాసభలో నాయకులగువారు ముందరకువచ్చి చేమోడ్చి నమస్కరించి- 'మహాప్రభో! మీరు ధర్మస్వరూపులు. ప్రజాక్షేమమే తమ క్షేమమని యెంచు మహాత్ములు. అటువంటి రాజయోగులగు ప్రభువుల యాజ్ఞ శిరసావహించకపోవుట సంభవమా! పరమేశ్వరుడైనను తమయందు నేరమెంచలేడు. న్యాయమూర్తులు. ధర్మదేవత మిమ్మాశ్రయించినది. సత్యసామ్రాజ్యము మీది. కాన తమరేయాజ్ఞనిచ్చిన నయ్యది శిరసావహించుటకు బద్ధులమని జెప్పి సభముగియగానే వెడలిపోయిరి. తదనంతరము దేశ

మంతటను చారులను నియమించి దేశదేశములలో ప్రతిగ్రామమందున 'ప్రజలలో ధర్మాత్ములను, సత్ప్రవర్తనకల్గిన వారిని సంరక్షించుటకు కంకణబద్ధులము. మేము చేయబోవు 'పురుషమేధ'మను క్రతువునకు యవినీతిప్రవర్తనగలవారిని సామంతప్రభువులైనను విచక్షణలేక దుష్ప్రవర్తనగలవారిని పట్టుకొని యజ్ఞస్థూపమునకు బంధించి, ఆమహాక్రతువులో బలిగా సమర్పించెదమని' సాటింపించెను.

ఎప్పుడీఘోరమైన సాటింపు దినదినము ప్రజలు వినసాగిరో, చారులు ప్రతిగ్రామమందును గానరైరో నాటినుండి ప్రజలు రాజశాసనమును ఏమాత్రము వ్యతిరేకించక యవినీతికి చోటీయక సత్ప్రవర్తనతో మెలగుచుండిరి. ఈర్ష్య, శతృత్వము నెచ్చటను గానరాకుండెను. తమకున్న తగవులను పరస్పరాంగీకారమువలన సర్దుపాటు చేసుకొనుచుండిరి. కృతయుగమందువలె తలిదండ్రులయెడ గురువులయెడల భక్తికల్గి విశాలహృదయముగలవారై సమస్తజీవులను యాదరణతో జూచుచు దయాశాలులై, యణకువ నమ్రతగల్గి మెలగుచుండిరి. మృత్యువుయొక్క భయముచేత లోకాంతరప్రపంచము యొక్క విచారణ ప్రారంభించి తెలిసికొనుచుండిరి. ఎవరికివారు తానొకడు బలియయ్యేనేని, తనవంశమునకు అపకీర్తియనియు, తనకుఅవమానకరమని చింతించుచుండిరి. ఇంత పరివర్తన ప్రజలలో కలిగి సత్యసామ్రాజ్యమైనను చారులు తిరుగుట మానలేదు. నీతిమార్గములను కూడ బోధించుచుండిరి. ఇంత ధార్మికబుద్ధి, న్యాయము, సత్యము రాజ్యమందు ప్రబలియున్నదని విని చక్రవర్తి చాల యానందించెను.

ఇట్టి యానందదాయకమగు వార్తలు చెప్పిన చారులను బహూకరించి, మంత్రి సామంత బ్రాహ్మణాదులను రావించి రాజు—

“నాప్రజలను సంరక్షించుట, జీవహింస నిర్మూలముచేయుట నాపరమావధియని మీకు విదితమే. యజ్ఞమునకు సమకూర్చిన ధనము యపరిమితముగానున్నది. ధర్మప్రవర్తనగల మనుజులెవ్వరును బలియిచ్చుటకుయర్హులుకారుగదా! మానవులనెవ్వరినైనను బలవంతముగ దెచ్చి యాహుతిచేయుదుమా, యిట్టి న్యాయమగుపరిస్థితులలో, నైజస్వభావముచే మానవుడు స్వాతంత్ర్యమునకై పోరాడి దేశమున సంక్షోభముకలుగజేయును. అందులకు మనుజులకు శక్తిసామర్థ్యములున్నవి. ధర్మాసక్తిపరులైనప్పుడు బలియన్న నియ్యకొనరు. చావునకు వెరచి ముందంజవేసి యీబలివలన స్వర్గము చేకూరునను విశ్వాసము సత్ప్రవర్తకులకు లేదు. వారు ధర్మమార్గము, సత్ప్రవర్తనయే మోక్షమార్గమని తలంచుచున్నారు. ఈయజ్ఞమును తలపెట్టిన బ్రాహ్మణోత్తములెవ్వరైనను ప్రజాక్షేమమునకై మృత్యుభయమును త్యజించి యిహసౌఖ్యముల విడనాడి, బలియీయబడుటకై, తమంతటతాము ముందంజవేసి సమర్పించుకొనుటలేదు. జంతువులన్నో నోరులేక మనుజులేమిచేసినను అందుకు లొంగిపోయి యుండుటవలన మనము స్వాతంత్ర్యము తీసికొని హింసించుటకు సాహసించుచుంటిమి. నిజముగా తిరుగుబాటు స్వభావముగల్గియున్నచో వాటిని హింసించుటకు సాహసించము. అయ్యవి మనలను నిగ్రహించి పశుత్వమును కనపర్చును. జీవము బ్రహ్మాదిపిపీలికాదులపర్యంతము ఒక్కటే. శక్తిసామర్థ్యములు లేకపోవుటచే యనేక కుతర్కముల వలన నిట్టిహింస మనము కడగుచుంటిమి. జీవరాసియంతయు నొక్కటేయని భావించగల మనుష్యుడు తానెందుల కాహుతి బొందలేడు. యజ్ఞపశువునకు ఆహుతి యనంతరము స్వస్వరూపమును బొందజేయగల్గు యగ్నిహోత్రుడు మనుజునకు కలుగజేయలేని శక్తిహీనుడా! అట్టి స్వర్గలోకమును బలవంతముగ పశువుచేత నేల బొందింపవలయునా? స్వర్గసుఖమును సంపూర్ణముగ గుర్తెరిగిన మనుష్యుడేల యనతికాలములో బొంది మోక్షమునుబొందరాదు. స్వర్గలోకమున కూడ నిట్టి యింద్రియవాంఛగల మనుజుడు యజ్ఞము చేసి మరియొకజీవిని హింసించి పుణ్యలోకమునగూడ హేయసుఖములబడయు నీచత్వముకంటే తానే యజ్ఞమందాహుతిజెంది శాశ్వతముగ స్వర్గలోకమును

పొంది బ్రహ్మానందమునం దోలలాడరాదా! ధర్మమూర్తులు, సత్యస్వరూపులు యెటులైన పరలోక సుఖములను సాధించగలరు. జీవహింసవలన నెవ్వరును సాధించలేరు. సృష్టియొక్క ఆదర్శమే 'అహింసాపరమోధర్మః'యని స్థాపించినద్విజులు ఆమార్గము నేల త్యజించవలెను. కాన ప్రస్తుతము చేకూరిన ధనమువలన మనకు జీవహింస యక్కరలేకయే యజ్ఞము కాగలదు. ఎచ్చట ధనలేమిగలదో వారి కీధనమంతయు ఇచ్చినచో వారి దారిద్ర్యము తొలగగలదు. ప్రస్తుతము మనమవలంబించు ధర్మమార్గమువలన దేవతలు సంతసిల్లి బాధ, క్షామము, అనావృష్టి తొలగింపగల్గుదురు'' యని తెల్పినప్పుడే కుంభవృష్టిగ వర్షించినందువలన, ఆపరమేశ్వరు డెంత దయాసముద్రుడో, ఎంతధర్మపరిపాలకుడో, ఆకరుణాసముద్రునికి సృష్టిలో భేదభావంతయైన ఎట్లు లేదో తెలియుచున్నది. కాన నీవిధముగ దేశమందు పాటింపించి ధనమును వినియోగపర్చవలెనని యాజ్ఞాపించెను.

చక్రవర్తి ధర్మబుద్ధికి, బ్రాహ్మణులు తలలొగ్గి 'ధర్మము, సత్యము' యొక్క యుచితజ్ఞత గుర్తించి జీవహింస పాపమని తెలిసికొని మంత్రులచే నీయబడు ధనమును సేకరించి యానందించిరి. ఆధనముతో ప్రతి పల్లెయందును, పట్టణమందును ధర్మశాలలు స్థాపించి ధనమును పంచిపెట్టి సుభిక్షమును చేకూర్చిరి. ధర్మప్రాబల్యముచే దుర్భిక్షము తొలగినది. చక్రవర్తికీర్తి పుష్పసౌరభమువలె నలుదెసల ప్రాకినది. ప్రజలందరు, చక్రవర్తియొక్క అహింసాతత్త్వమునకు యచ్చెరువంది, సత్యమువలనను, ధర్మమువలనను యిహపరసౌఖ్యములు చేకూరునని నమ్మి, సుభిక్షముగల్గి, పంటలుపండి, వ్యాధిబాధలేక సుఖజీవనముచేయుచుండిరి. ప్రజలందరును చక్రవర్తికి యనేకమగు కానుకలనుయిచ్చి దేశపరిస్థితులను, ప్రజాసౌఖ్యమును తెల్పుచుండిరి.

ఒకనాడొకరాజోద్యోగి కొలువునందు చక్రవర్తితో- 'మహాప్రభూ! చక్రవర్తులు పండితులతోనూ, పామరులతోనూ, వర్తకులతోనూ, సమస్త ప్రజలతోనూ యేదోయొక సంబంధముండి పొందిన యనుభవమువలననే వారిబుద్ధిచాతుర్యము వర్ణనాతీతము. తమరు యజ్ఞదీక్షను ధర్మదీక్షయనినందువలన సమస్త యజ్ఞయాగాది క్రతువులు, ధర్మమందును, సత్యమందే కలవు. స్వలాభాపేక్షకొరకు జీవహింసచేయుచు, వేదప్రమాణమును కుతర్కమువలన హింసారూపకముగ మార్చుట యధర్మమని, యసత్యమని ప్రజలు ప్రత్యక్షముగ తెలిసికొనిరని' నుడివెను.

కాన ఎవరిహృదయము పవిత్రమైనదో, నైర్మల్యములేనిదో వారు ఎన్నటికిని కుతర్కమునకుగాని, కుజనులయొక్క దుర్బోధనలకుగాని, యన్యాయమునకుగాని, యసత్యమునకుగాని, తావీయక ధర్మమార్గమున లోకకళ్యాణమును చేకూర్చగల్గుదురు.

—జాతకకథలనుండి.

వచ్చుచున్నది !

తర్వలో వచ్చుచున్నది !!

బెజవాడ సరస్వతీటాకీస్ వారి రెండవ మహత్తర తెలుగుటాకీ.

# KANAKATARA (కనకతార)

డైరెక్టరు: హెచ్. వి. బాబు.

ఈ చిత్రము పౌరాణిక సాంఘిక, చారిత్రక చిత్రములలోని సౌందర్యమును సంతరించుకొని సర్వాంగ సుందరమై వచ్చుచున్నది.

ముఖ్యపాత్రధారులు:

దొమ్మేటి, కన్నాంబ, ఆరణి, బసవయ్యశాస్త్రి, దుర్గాప్రసాద్, రాఘవన్, కుంపట్ల, మంజరి, చిత్ర, వీర్రాజు, కమలకుమారి ప్రభృతులు.

విడుదల తేదీకై ఎదురుచూడుడు. ట్రయిలరు ప్రతి ప్రదర్శనశాలలోను ప్రదర్శింబడనున్నది.



*For Booking Apply to:*

**SARASWATI TALKIES LIMITED, Bezwada. or**

**3, Mariappanaick St., Theynampet, Cathe[illegible]al P. O. Madras.**

# మధ్యాహ్నం ముద్దు

[చేసుకున్న పెళ్లాం : చేసుకోతలచిన పెళ్లాం]

రచయిత:

తోలేటి గంగాధరము, ఎం. ఎ.

[గతసంచిక తరువాయి]

'ప్రియా! నిన్నుచూచుటకు నాకు చాలా ఆనందంగావుంది. కాని, దయచేసి నన్ను మరోసారి చూడ్డానికి నీవు ప్రయత్నంచేయవద్దు.'

ఆమె కాపురంఉన్నకొంప చాలాపాతది. ఆగది అంత ఆకర్షణీయంగాలేదు. కాని ఏవో కొత్త కర్టెనులుకట్టి, గోడలకు కొత్త బొమ్మలుకొట్టి దానిని కూడినంత ఆకర్షణీయంగా చేయుటకు లూసీ సంకల్పించి పని చేసిందని తోచకపోలేదు. ఆగదిలో సోఫా మీద నాకౌగిటిలో లూసీతో నేనుకూర్చుని ఆమెతో మాట్లాడుతూవున్నంతసేపూ ఆగది నా కొక స్వర్గమందిరమువలె తోచింది.

ఆగదిలో తాను ఒంటరిగా నివశిస్తున్నానని లూసీ చెప్పింది. ఆమె ఇదివరకు ఎవరినీ ప్రేమించి ఉండలేదు. ప్రేమించక ప్రేమించక తాను ప్రేమించినపురుషుడు వివాహమైనవాడైనాడు. అట్టి స్థితిలో ఆమె చేయవలసిన పనియేమిటి? నాకును నాభార్యకును నడుమను ఉండకుండ నాకు దూరమైపోవుటయే ఉచితమైందని ఆమెకు తోచింది.

నాభార్యకు ద్రోహముచేయాలనే తలంపు నాకు ఎప్పుడూలేదు. నాభార్యకు నాకు సాగుతూవుండే దాంపత్యధర్మాన్ని లూసీకి విడమర్చిచెప్పి లూసీని శాశ్వతముగ నాదానిని చేసుకోవాలని నాతలంపు. చిరవియోగానంతరము కలుసుకున్నామేమో ఆమెను నాకౌగిలినుండి సడలిపోనిద్దామనే ఉద్దేశం నాకు ఎంత మాత్రమూ లేదు. కాబట్టి నేను లూసీకి ఉన్నదున్నట్టు చెప్పేశాను. నాభార్యను విడాకుకొరకు అడిగాననీ, దానికి ఆమె సుతరామూ అంగీకరించలేదనీ చెప్పేశాను.

అప్పుడు లూసీతలను నాజబ్బలకు ఒరసి పట్టుకున్నాను. గాఢంగా ముద్దుపెట్టుకున్నాను. లూసీకనక నన్ను వివాహంచేసుకోడానికి వాగ్దానంచేసినట్లయితే నాభార్యను బలవంతంచేసి విడాకు పుచ్చుకుంటానని చెప్పేను.

'ఆమె అల్లరిచేసేమాట నిజమే. అల్లరి చెయ్యనీ! మనం ఒకరికి ఒకరందక్కుతాము. మనకికావలసింది అదేకాదూ?' అని లూసీతో అన్నాను.

లూసీ తనబాహులతతో నాకంఠసీమను పెనవైచుకొన్నది. తన పెదవులను తెచ్చి నా పెదవులకు అందించింది.

బయట రోకళ్ళలావు ధారలతో వర్షించుచున్నది. అయినను లోనవెచ్చగానే ఉన్నది. విశాలవిశ్వమునందంతటికిని నాకు కావలసిన

ఏకైక స్త్రీవ్యక్తి నాచేతులలో వెన్నవలె కరుగుచున్నది.

అంతవరకే. అంతకుమించి ఎట్టి అనుచిత కార్యముగాని చేయుటకు మేము ఒడబడలేదు. వీలయినంతత్వరలో ఆమెను వివాహమాడుటకు నేను కృతనిశ్చయుడనై వాగ్దానముచేసియున్నాను. కాని ఒకరి సహచర్యము కోసము ఒకరము తహతహపడుచున్నాము. కావున ప్రేమభరమున, ఆనందోద్రేకమున మేము ఇతర విషయముల నన్నిటిని మరిచిపోయితిమి. ఆమెను నేను వీడుసరికి అర్ధరాత్రి అతిక్రమింప జొచ్చెను. విడాకువిషయమై తొందరపడకుండుటకే మేము నిశ్చయించితిమని మాత్రము చెప్పుటకు నేను మిక్కిలి సిగ్గిలుచున్నాను.

కాని లూసీ చెంతనున్నంతసేపును నేను చాల ఆనందముగను, గర్వముగను ఉంటిని. వచ్చువేళ ఆమెను కౌగలించుకొని నెమ్మదిగ ఇట్లు చెప్పితిని: 'నేను రేపే నాభార్యతో నిష్కర్షగ చెప్పివైతును. విడాకుకై నిర్బంధింతును.'

లూసీ ఇదివిన్నది. తన్నుగురించికాని, తన భావినిగురించిగాని ఏమాత్రమును తలపునపెట్టుకొనలేదు. స్వార్థరహితమైన దృష్టితో ఉపదేశించినది: విడాకువిషయమున తొందరపడవలదని, తనభార్యను ఒక్కసారిగ చెంగనాడవలదని,. విడాకువివాదవలన నాప్రతిష్ఠ భంగమగుటకాని నాతలిదండ్రులకు కష్టముతోచుటకాని తనకు సమ్మతముకాదని తెలిపింది.

'నీభావినిగూర్చి నీవు మరిచిపోవద్దు. మనము నెమ్మదిగ నిగ్రహింతము. కాలమే అన్నిటిని సర్దుబాటు చేయగలదు. ఈలోగా ప్రతి సాయంకాలమును ఇక్కడికివచ్చి నీవు నన్ను కలసికొనవచ్చు. నీకు తీరుబడిఅయినప్పుడల్లా, రావాలని కోరిక కలిగినప్పుడల్లా రావచ్చు.'

ఇట్లా చెపుతూ ఆమె తనపెదవుల్ని నా పెదవులకు అందించింది. వరప్రసాదమువలె నేను వాటిని అందుకొంటిని. నిజానికి నాగుండెల్లో విడాకువల్ల వచ్చే అపదూరుకు భయంగానేఉంది. లూసీని శీఘ్రముగ వివాహము చేసికోవడమే నాజీవితమునకు చంద్రోదయమను సంగతిని నేను తెలిసికోవలసింది.

హృదయపూర్వకంగా నేను ప్రేమించిన ప్రేమించగలస్త్రీ లూసీయే. నాభార్యతో విడాకుపుచ్చుకొనుటవలన కలిగే అపదూరును కొద్దికాలము తట్టుకొంటినేని లూసీని వివాహమై జీవితాంతమువరకూ సుఖింతును. కాని అట్లు తట్టుకొనుటకే నాకు సాహసము లేకపోయింది. బొత్తిగా సులభమైన మార్గాన్ని అవలంబించేను.

నావిషయమై లూసీ స్వార్థరహితమైన ప్రేమతోవుంది. నన్ను ఆమె పూర్తిగా నమ్మింది.

మమ్మల్నిగూర్చి ప్రజల్లో ఎట్టి గుసగుసలు కాని బయలుదేరకుండా ఉండేలాగున మేము ప్రవర్తించేము. మధ్యాహ్నంమాత్రం మేము ఎప్పుడూ కలుసుకునేవారంకాము. రాత్రి భోజనం అచటనే చేసేవాడిని. ఆచుట్టుపట్ల అందరూ నేను ఆమెభర్తననే అనుకునేవారు. అట్లే వ్యవహరించేవారు కూడాను.

అవి సుఖమయదినములు.

లూసీ స్వయంగా వంటచేసేది. వంటదుస్తులలో ఆమె మరింత అందముగా కనిపించేది. ఆమె వంటచేస్తూవుండగా నేనున్నూ వంటయింట్లోనేవుండి ఆసామానూ ఈసామానూ సర్దుతూ వుండేవాడిని. ఐదేసి నిమిషాలికి ఓసారి ఆమెను ముద్దుపెట్టుకుంటూ వుండే

వాడిని.

లూసీయే నానిజమైనభార్యగా నేను భావించుకునేవాడిని. స్వార్థమన్నది లేకుండా సర్వస్వమూ నాకు అర్పణమైపోయిన ఆమెను సహధర్మచారిణిగా పొందినందుకు నేను చాలా ఆనందించేవాడిని. ఆసంతోషంయొక్క మైకంలో మమ్మల్నిగూర్చి ఇతరులు ఏమనుకుంటారో అనేదృష్టి నాకు లేకపోయేది. లూసీమాత్రం ఆవిషయమై జాగ్రత్తవహించి ఉండాలని పదేపదే చెపుతూవుండేది.

ఆమెది సరళమైనమనస్సు. మిక్కిలి ఓర్పు గలది. ఎవరినిగూర్చి కాని ఏమీ అనేదికాదు. నాభార్యగుణాలతో కలహించి లాభము లేదనీ, విడాకుపుచ్చుకున్నతరువాత ఆమే శాంతంవహిస్తుందనీ లూసీ చెపుతూవుండేది.

కాని... కాలం ఒక్కలాగున ఉండదు... ఆరుమాసములుగ ఆనందసముద్రంలో ఓలలాడుతూవున్నాం. ఇంతల్లో ఒక అవరోధం ఏర్పడ్డది.

కొత్తరోజుల్లో మాపెళ్ళివిషయమై ఇదుగో అదుగో అంటూవుండేవాడిని. కాని ఇప్పుడు కథ సజావుగా నడుస్తూవుండడంచేత పెళ్ళిసంగతే తలపెట్టడం మానేశాను. లూసీ మాత్రం అప్పుడప్పుడు నిట్టూర్పులు విడుస్తూ నిరుత్సాహంగా వుండేది. నాభార్యతో విడాకుపొంది తన్ను ఎప్పుడు పెళ్ళిచేసుకుంటానో అనేసంగతి తెలిసికోడానికి ఆమెకు తహతహ అగ్గలంగావుండేది. అల్లాంటి సందర్భాల్లో నేను మరోధోరణిలోకి సంభాషణ మార్చేసేవాడిని. పెళ్ళిసంగతిమాత్రం తలపెట్టేవాడిని కాదు.

కామవిషయంలో మేము ఇప్పుడు భార్యాభర్తలమై ఉన్నాము. పెళ్ళికాకుండానే భార్యాధర్మం నిర్వహిస్తూన్నందుకు ఆమెకు మానసికంగా నిరుత్సాహం ప్రబలిఉండాలి. మాప్రేమ నేటి సంఘమర్యాదలకు వ్యతిరేకమైందనీ, వ్యభిచారంక్రింద పరగణించతగిందనీ మాకు తెలుసు. లూసీ ధర్మము, న్యాయము, కట్టుబాటు మొదలగు వానిని పట్టుదలతో గమనించేమనిషి. అయినా ఆమె నాకోసం, నాసుఖంకోసం పెళ్ళికాకుండానే నాతో కలిసి వుండడానికి సమ్మతించింది.

ఇది ఇల్లావుండగా వృత్తిలో నాకు మంచి అభివృద్ధి కలిగేటట్లు తోచింది. మదరాసులోని వర్తకుల్లో బాగా డబ్బువున్నవాడున్ను మంచి పలుకుబడిగలవాడున్ను అయిన గోపినాధచెట్టి యం. యస్. యమ్. రైల్వేకంపెనీమీద తెచ్చిన దావాలో నాకు వకాల్తునామా యిచ్చినాడు. ఇందుతో నాకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది.

కలిగిన ఆనందం చాలారోజులు ఉండలేదు. ఒకానొక పురుషుడు అన్యస్త్రీతో సంబంధం ఏర్పరుచుకుని లోకానికి తెలియబడకుండా వుండడం కథల్లోను నవలల్లోను కనబడేవిషయమేకాని మామూలు జీవితంలో అసంభవమైంది. లూసీసంగతి, నాసంగతి, మాస్నేహంసంగతి ఎవరికీ తెలియదని నేను అనుకున్నాను. కాని నిజానికి మమ్మల్నిగూర్చి లోకమంతా గుసగుసలు పోతూనే వున్నట్లు నిశ్చయమైంది.

ఒకనాడు ఉదయాన్ని మానాన్న నాదగ్గరకువచ్చి గోపినాధచెట్టి తనకేసును మరో వకీలుకు ఇచ్చేడనీ, అల్లా ఇవ్వడానికి కారణం నాచెడ్డనడతే అనీ చెప్పినాడు.

నాన్నకు నామీద చాలాకోపంవచ్చింది. నాసంగతి సందర్భాలన్నీ కనిపెట్టడానికి గాను చారుల్ని నియమించాడు. వారు నేను అలందూరులో అర్ధరాత్రివేళ లూసీగృహాన్నుంచి

బయటికివస్తూవుండడం చూశారు. ఇతరసమయాల్లో నేనూ లూసీ కలిసివుండడమున్నా వాళ్ళకళ్ళను బడ్డది.

ఇంతవెల్లడిలోకి వచ్చేక అది కాదనడం అసంభవం. నాన్న నన్ను చాలాకోప్పడి ఆమె స్నేహంచేయడం మానివేయమని నిష్కర్షగా చెప్పేశాడు. నేను అతనిమాటకు ఎదురుకున్నాను. అందుతో అతనికి పట్టరాని కోపంవచ్చింది. కోపవేగాన్ని ఆవృద్ధునికి గుండెదడవచ్చింది. కొన్నివారాలవరకు అతనిస్థితి చాలా ప్రమాదావస్థలోనే వుండింది. క్రమంగా అతనికి కొంచెం ఆరోగ్యం కలిగిందికాని ఇక ఏపని చేయడానికిన్నీ అతను అసమర్థుడయ్యాడు. నన్నుగురించిన గుసగుసలు లోకమంతా వ్యాపించాయి. నేను ఎక్కడికి వెళ్ళినా అక్కడివాళ్లు నన్నుగురించే గుసగుసలు పోతూవుండేవారు. మాఅమ్మ చాలా దూరంచెప్పింది ఆవ్యవహారం మానమని. ఇదిఅంతా విని లూసీకూడా నాకుటుంబానికి నేను అవమానంతెస్తున్నానని చెప్పింది.

కాని ఇంతమంది ఇన్నివిధాల మాటలాడుతున్నా నాభార్యమాత్రం ఏమీమాటలాడలేదు. క్రమక్రమంగా మేము ఒకరికి ఒకరం దూరమైపోయాము. గవ్వలు, పేక మొదలైనవి ఆడుకుంటూను; ఊలుకుట్లు, అల్లికకుట్లు అల్లుకుంటూను ఆమె కాలం వెళ్ళతోసేది.నారాకపోకల్ని ఆమె గమనించేదికాదు. నేను సాయంకాలాలు సాధారణంగా ఇంటికి వచ్చేవాడినికాదు. రాత్రిభోజనం ఒకవేళ యింటివద్దేచేశినా భోజనం అయిపోవడంతోటే తిరిగి బయటికి వెళ్ళిపోయేవాడిని. ఇల్లా వెళ్ళిపోతున్నా నాభార్య ఎప్పుడూ కాదనలేదు. ఆమెతో ఏవిధాన్ని పోట్లాడదామన్నా ఆమె అవకాశమే యిచ్చిందికాదు. ఈ పరిస్థితుల్లో మౌనమే పరమహంసక్రియ అని ఆమె అనుకుంది కాబోలు.

నేనుధైర్యస్థయిర్యములతో నిలబడవలసిన కాలంవచ్చింది. నాభార్యతో నేను విడాకుపుచ్చుకుని లూసీని నేను వివాహంచేసుకోదలచానని తల్లిదండ్రులతోను కుటుంబంలోని ఇతర వ్యక్తులతోను చెప్పివేయవలసిన తరుణం వచ్చింది, కాని నేను అట్లా చేయలేకపోయాను. అంతటిధైర్యం నాకు లేకపోయింది. నేనుధైర్యంతో ఆపనిచేస్తే వృద్ధుడైన నాన్నగుండె చలనం ఆగిపోయి చనిపోతాడని నాకు భయంవేసింది. నేను అంతపనీ చేస్తే నిజానికి మానాన్న అట్లు మరణించేవుండునేమో! మీదు మిక్కిలి లోకాభిప్రాయానికికూడా నేను జంకడానికి ప్రారంభించాను. లోకంచేత మంచివాడిని అని అనిపించుకుందామనీ, వృత్తిలో గొప్పవాడిని అవుదామనీ కాంక్ష బయలుదేరింది.

ఇన్నీ కూడినాయి. లూసీని అలందూరునుంచి మకాం ఎత్తివేసి మరోచోట పెట్టమన్నాను. ఆమెవద్దకు అప్పుడప్పుడే కాని తఱుచు వెళ్ళడం మానేశాను. ఇంటివద్ద మాత్రం ఆమెనుపూర్తిగా వదిలేశానని చెప్పేశాను. మానాన్నకు చాలా ఆనందమైంది. నన్ను క్షమించాడు. గోపినాధచెట్టితో మాట్లాడి తిరిగి కేసు నాకు యిప్పించాడు. నేను అందులో బాగా పనిచేసి నెగ్గించేను.

అందుతో వృత్తిలో నాకు మంచిపేరు వచ్చింది. నావద్దకు కేసులమీద కేసులు వచ్చి పడుతున్నాయి. సాధారణంగా అన్నింట్లోనూ గెలుచే. ఆరుమాసాల్లో నేను గొప్ప పేరూ, విశేషధనమూ ఆర్జించాను. నాప్రార్థనమీద లూసీ తనమకాములు ఒకపేట

నుంచి మరోపేటకు మారుస్తూవుండేది. ఇల్లా చేయడంవల్ల మమ్మల్నిగూర్చిన గుసగుసలు తగ్గిపోతాయని మానమ్మకం. ఇన్నికష్టాలు ఉన్నా మాప్రేమవల్ల మాజీవితాలు ఆనంద మయంగానే వుండేవి. ఇపుడు మాసంభాష ణల్లో ఎప్పుడూ మాపెళ్ళి విషయం రావడ మేలేదు. వృత్తిలో నేను బాగా ఎక్కువస్తూ వుండడంచేత లూసీ తాను రహస్యంగానే వుండడానికి కృతనిశ్చయురాలు అయింది. ఆమె తిండికిగాను నేనిచ్చేడబ్బుతోటే ఆమె తృప్తిపడేది.

లూసీఅంటే నాకుండే ప్రేమలో కొంచెం కూడా తగ్గలేదు. ఎప్పటికైనా ఆమెను పెళ్లా డాలనే నాఉద్దేశం. కాని ఇప్పుడు ఆమెకో ప్రత్యర్థి బయలుదేరింది. వృత్తిలో అతిలోక కీర్తి సంపాదించాలనే నాగాఢవాంఛయే ఆ మెకు ప్రత్యర్థిగా ఏర్పడ్డది. లోకులు మమ్మ ల్నిగూర్చి ఇంకా గుసగుసలు పోతూనే వుండే వారు. అయినా మేము తఱుచు కలుసుకో వడం తగ్గించడంచేత ఆగుసగుసలు అంతగా పొక్కువికావు. ఈమాదిరిగా కొంతకాలం గడిచిపోయింది. ఇంతలో మరోకొత్త ముస లం ముంచెత్తుకొచ్చింది.

ఒకనాటి సాయంకాలం లూసీయింటికి మామూలుప్రకారం వెళ్ళేను. ఆమె ఏదో సుఖమయకల్పనలో వున్నట్లు, అవ్యక్తమైన ఆనందంలో ఉద్వేలితమౌతూన్నట్లు నాకు ద్యోతకమైంది. ప్రార్థనామృదూక్తులతో ఆమెను అనునయించాను సంగతి తెలుసు కుందామని.

ఆమె ఓపట్టాన్ని నాకు చెప్పలేదు. నెమ్మది నెమ్మదిగా ఆమె తనకు చూలునిలిచినసంగతి చెప్పివేశింది.

ఆమె నాబాహులతల్లో బంధింపబడి ఉం డగా ఆమాటలు విన్నానేమో నాకు మొద ట్లో చాలా ఆనందం కలిగింది. మాదాంపత్య వృక్షమున ఒక అమృతఫలము కలగబోతు న్నది. అది ఎంతటి ఆనందకరమైనవిషయం!

కాని ఇంతలో భవిష్యత్తు జ్ఞాపకం వచ్చింది. తీరనిబెంగ నామనస్సులో ప్రవేశిం చింది. లూసీనాకు మరింత దగ్గరగాచేరి మన వివాహం జరిగితేకాని మనబిడ్డకు చర్చిలో పేరుపెట్టడానికి వీలుండదు అనిఅంది. అప్పుడు నాకు కలిగిన చికాకును దాచుకోలేక పో యాను.

'అయితే నువ్వునన్ను పెళ్లాడదలచుకో లేదన్నమాట' అని దెబ్బతిన్న ఆడుపులివలె ఆమె నన్ను అడిగింది.

'మనం తప్పకుండా వివాహంచేసుకుం దాం. కాని దానికి కొంతకాలాతిక్రమణం మాత్రం కావాలి. ఇప్పుడే మన వివాహం జర గాలంటే దుస్తరమే. విడాకుశబ్దం వినబడేసరి కల్లా వెల్లి నాభార్య మానాన్నకాళ్లమీద పడుతుంది. మానాన్నకు అసలే ఆరోగ్యం బాగాలేదు. గుండెదడతో బాధపడుతూ వున్నాడు. ఈపరిస్థితుల్లో ఏమాత్రం వ్యతి క్రమం జరిగినా గుండెదడ ఎక్కువై అతనికి అపాయంకలగక మానదు.' అని జబాబు చెప్పేను. జబాబు అయితే చెప్పేనేకాని తేరి పారి ఆమెముఖంకేసి చూడలేక పోయాను. ఆమెదృష్టికి ఎదురొడ్డి చూపు సారించలేక పోయాను.

[సశేషము.

Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.

శ్రీ కృష్ణుని జీవితమునందలి రసవత్తరఘట్టము నొకదానిని

నాట్యకళాభిజ్ఞుల నేర్చికూర్చి సాంకేతికప్రవీణులసహాకారముతో

బొంబాయిలోని ప్రసిద్ధ స్టూడియోలో,

తెలుగు, అరవము, కన్నడము,

## మూడు భాషలలో

శాస్త్రపరిపక్వముతో తయారు చేయబడుచున్నది.

ఒకేకథను మూడుభాషలలో వ్యాపారకళాదృష్టులతో చక్కగా తీయుటకు

హిందూదేశమున ఇదే ప్రథమప్రయత్నము

## లక్ష్మీ సినీటోను (లిమిటెడ్)

**146,** బ్రాడ్వే, మదరాసు.